ముముక్షుజన గ్రంథమాలా- ౧౦ వ పుష్పము.

# అమృతవాహిని



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ శ్రీ శ్రీ (1008) సీతారామ యతీంద్రులు.

ముముక్షుజన గ్రంథమాలా-　　　　　　　　౧౦ వ పుష్పము.

# అమృతవాహిని



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ శ్రీ శ్రీ (1008) సీతారామయతీంద్రులు.

ప్రథమ ముద్రణ
వేయి ప్రతులు

సంపాదకుడు
ముక్తిని ఉడయవర్.

వెల $1\frac{1}{2}$ రూపాయి
గ్రంథమాల సభ్యులకు నాల్గవ వంతు తగ్గింపు.
క్యాలికో బైండు $\frac{1}{2}$ రూపాయి అదనము.

ముముక్షువు ముద్రణాలయము,
పవరుపేట — ఏలూరు.

ముముక్షుజన గ్రంథమాల
పవరుపేట — ఏలూరు.

ఓమ్ శ్రీ పరమాత్మనే నమః

# శుభాశీస్సులు

మూకం కరోతివాచాలం
పంగుం లంఘయతే గిరిం
యత్కృపా తమహం వందే
పరమానంద మాధవం॥

సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడునైన పరమాత్మ, అజ్ఞుడను, అసమర్థుడను అయిన నాచేత భగవద్గీతకు వ్యాఖ్యానము వ్రాయించుట ఒకవింత. ఆయన ఏమిచేయలేడు!

1955 సంవత్సరములో బొబ్బిలిరాజావారియొక్కయు, బొబ్బిలిరాణీగారియొక్కయు ఆహ్వానముపై చాతుర్మాస్యవ్రత దీక్షను బొబ్బిలిలో జరిపితిమి. ఆ సంవత్సరము భాద్రపద మాసము అధికమాసము వచ్చుటచేత వ్రతకాలము అయిదు మాసములయినది. కనుక, మేము జూన్ 30 నుండి నవంబరు నెలాఖరువరకును బొబ్బిలిలో ఉంటిమి. బొబ్బిలిరాజావారును రాణిగారును, చిక్కవరం రాజాగారును రాణిగారును చేసిన సౌకర్యములును, చూపిన ఆదరణమును అపారములు. 'గెస్టు హౌసు' మాకు విడిది అయినది. ప్రచారకార్యక్రమములలో విరామములేక, అమృతవాహిని (గీతకు వ్యాఖ్యానము) వ్రాయుట కేమాత్రమును తీరికగాని, అవకాశముగాని చిక్కక పోవుటచేత, చాతుర్మాస్యదీక్షఅనెడి నెపముతో విశ్రాంతిగా

యుండి ఆ వ్యాఖ్యానరచనా కార్యక్రమమును కొనసా
వలెనని ఉద్దేశించితిని.

మొట్టమొదట రెండుమాసములు రోజుకు ఏ నా
గంటలో నిద్ర, భోజనసమయము, సాయంత్రము ఆరుగం
నుండి ఎనిమిది గంటలవరకును గీతాప్రవచనము, ఒక
సంకీర్తనము పోను మిగిలిన సమయమంతయును ఒక్క
సముగూడ వృథాపోనీయక వ్రాయుటయే అయినది.
ఒక నెల జరుగునప్పటికి, చిక్కవరంరాజాగారువచ్చి, 'విశ్ర
లేకుండ ఇట్లు వ్రాసినట్లైన తమ ఆరోగ్యము తప్పక చెడ
కనుక, ప్రతిరోజును కొంత విశ్రాంతిసమయమును నిర్ణయి
కొనవలయును' అని బలవంతపెట్టిరి. వారి నిర్బంధ మె
వగుటచే నాకు ఇష్టములేకపోయినను చివరకు, 'ప్రతిరో
కాక, వారమునకొకరోజు విశ్రాంతి' అని నిర్ణయించితిని.
రోజు ఏరోజు అని ఆలోచించుచుండగా, చిక్కవరం రాణీ
'గురువుగారికి విశ్రాంతిరోజు గురువారంఅయితే బాగుంటు
అని తీర్మానించినారు.అదియేఖాయమైనది.ప్రతిగురువారమ
బొబ్బిలిరాణీగారును, చిక్కవరంరాణీగారును, చిక్క
రాజాగారును, మేమందరమును కలిసి రెండుమూడు క
మీద వాహ్యాళికి బయలుదేరి తిరిగితిరిగి వచ్చెడివారము.
విధముగా ఒక నెల జరిగినది.

మూడవనెలలో మెల్లిమెల్లిగా చుట్టుపట్ల ప్రచార
ప్రారంభమైనది. వ్రాయుట మొదటి రెండునెలలే సాగి

ఆ కారణమున గీతయొక్క మొదటి నాలుగధ్యాయములకు మాత్రమే వ్రాయగలిగితిని. ఇప్పటికి సుమారు రెండు సంవత్సరములయినది–మరల కాగితముపై కలము మోపలేదు. తిరిగి ఏ నూజివీడులోనో ఒక నాలుగుమాసములు ఏకాంతముగ నుండి వ్రాయదలచుకొనినాను. భగవత్సంకల్పమెట్లున్నదో !

ఇంతవరకు అయిన నాలుగు అధ్యాయములును క్రౌన్ సైజు అచ్చులో సుమారు తొమ్మిదివందలపుటలు కావచ్చును. ఒక్కొక్క అధ్యాయము ఒక్కొక్క పుస్తకముగా అచ్చు వేయించుచున్నారు. ఇప్పటికి ప్రథమోధ్యాయము అచ్చు పూర్తిఅయినది. ఈ నాలుగు అధ్యాయములు వ్రాయునంత కాలమును ఎక్కడను ఏకొఱతయు రాకుండ కన్నతల్లికిమించి సకలసౌకర్యములును అన్నివిధముల కనిపెట్టి ఏర్పాట్లుచేసిన బొబ్బిలి రాణీగారయిన శ్రీమతి లక్ష్మీసుభద్రమ్మ తల్లికిని, శ్రీమతి యశోదమ్మ తల్లికిని (చిక్కవరం రాణీగారు), ఏ కొఱతలును ఎంతమాత్రమును రాకుండ పైనుండి అజ కను గొనుచు ఆదరించిన శ్రీ బొబ్బిలిరాజావారికిని, చిక్కవరం రాజాగారికిని హృదయపూర్వకమైన శుభాశీస్సులు. వీరు ఆర్థికముగా ఎంతఅపారముగా తోడ్పడినను ఆ విషయము పత్రికలో సూచనప్రాయముగనైన ప్రకటించుట వారికెంత మాత్రమును గిట్టదు. కాన, ఆ విషయ మిచ్చట ప్రస్తావించ దలచలేదు.

ఈ అధ్యాయము ప్రస్తుతము ముద్రణఅగుటకు పూర్తి ఆధారమైన శ్రీ తేలప్రోలు రాణీగారగు రాజరాజేశ్వరమ్మ తల్లికి నా హృదయపూర్వకశుభాశీస్సులు.

వేళకు పాళకు వేడి వెచ్చజేసిపెట్టిన శ్రీ మోచర్ల శీతమ్మ తల్లికిని, శరీరములో ఎంతఅనారోగ్యముగనున్నను ఏమాత్ర మును విసుగులేకుండ ఆమెకు చేదోడు వాదోడుగా అన్నివిధ ముల సహాకరించిన శ్రీమతి ముక్తేవి రాజ్యలక్ష్మమ్మతల్లికిని నా హృదయపూర్వకమైన శుభాశీస్సులు. నాకు గీతా నిఘంటువు తయారుచేయవలయునని తలంపుగలదని చెప్పినంత మాత్రమున చాల శ్రమజేసి, గీతలోని శబ్దములనన్నిటిని అకారాది అనుక్రమణికగ తయారుచేయుటయేగాక, సీతమ్మ తల్లి కంటివైద్యమునకు విశాఖపట్టణము వెళ్లుటయు, అదే సమయమున ముక్తేవి రాజ్యలక్ష్మమ్మతల్లి మలేరియాజ్వర ముతో నుండుటయు సంభవించగా ఒకనెల నాకు భోజనము తయారుచేసిపెట్టిన శ్రీ కోవెల రామానుజాచార్యులుగారికి నా హృదయపూర్వకమైన శుభాశీస్సులు.

నన్ను క్రిందనడవనీయకుండ ప్రతిక్షణము ఉపచారములు చేసిన ముసలయ్య, లక్ష్మీనారాయణ, వెలివెల నాగభూషణము గార్లకును, నేను వ్రాసినది వ్రాసినట్లుగ చక్కగ ఎప్పటికప్పుడు సాఫువ్రాసిన శ్రీ ముక్తేవి పెరుమాళ్ళదాసు, చిత్రపు భాస్కర దాసుగార్లకును హృదయపూర్వకమైన నా శుభాశీస్సులు.

ఏలూరులో ముముక్షువు ముద్రణాలయములో ఈ ప్రథమోధ్యాయము అచ్చుగుపట్ల మరల అవసరమువచ్చుటచే బహుజాగ్రత్తగ సాఫులు వ్రాయించి కష్టపడిపనిచేయించిన 'ముముక్షువు' సంపాదకులు చిరంజీవి ముక్తీవి ఉడయవర్, సహాయసంపాదకులు చిరంజీవి ముక్తీవి లక్ష్మణదాసు, చిరంజీవి ముక్తీవి విజయరామదాసు, చిరంజీవి చిత్రపు శివశంకరం, చిరంజీవి కూనపులి శ్రీరామశర్మలకు నా హృదయపూర్వకమైన శుభాశీస్సులు.

ఎప్పటికప్పుడు ప్రూఫులు దిద్దుచు కడుజాగ్రత్త తీసికొనిన శ్రీ నండూరు సుదర్శనదాసుగారికిని, ప్రతిఒక్కరును కష్టపడి స్వంతపనివలె భావించుకొని అత్యుత్సాహముతో ముద్రణపనిని పూర్తిసంతృప్తిగ పూర్తిచేసిన ముముక్షువు ముద్రణాలయములోని పనివారలందరకును నా హృదయపూర్వకమైన శుభాశీస్సులు.

ఈ అమృతవాహిని పాఠకులకు ఏ మాత్రము ఉపయోగపడినను నా శ్రమ పూర్తిగ సఫలమైనట్లును, నేను ధన్యుడనైనట్లును తలంతును.

సర్వే జనా స్సుఖినో భవంతు

3—6—1957
శ్రీకృష్ణాశ్రమము

ఇట్లు,
సర్వజనశ్రేయోఽభిలాషి
సీతారాం.

# సంపాదకుని మనవి.

ముముక్షుజనగ్రంథమాలను శ్రీ గురుదేవులు ఏనాడో స్థాపించినారు. ఇప్పటికి కొన్నిగ్రంథములుగూడ ప్రకటింపబడినవి. కాని, అనుకొనినంతగాగాని, జరుగవలసినంతగాగాని ఈ గ్రంథమాలద్వారమున ప్రచార కార్యక్రమము జరిగియుండలేదని అంగీకరింపకతప్పదు. అందులకు ముఖ్య కారణము మూలధనములేమియే. ఇంతవరకు జరిగిన గ్రంథప్రచురణ అయినను శ్రీవారి చలువవలననేగాని సంపాదకుని కృషిగాని, సామర్థ్యముగాని అందులకు కారణములుకావు. అన్నిహంగులును శ్రీవారు సిద్ధపరుచగా చివరకు మాటదక్కించుకొనుటయే సంపాదకునిపని.

ఈ 'అమృతవాహిని' ముద్రణ విషయమున కృషిచేసి విజయకారకులయిన అందరితోపాటు సంపాదకునిగూడ శ్రీగురుదేవులు ఆశీర్వదించినారు. వారి ఆశీర్వాదములను అపరిమితానందముతో ఔదలదాల్చుటయేగాని, యథార్థము చెప్పవలసినచో అందులకు సంపాదకునికి ఏమాత్రమును అర్హతలేదనియు, ఈగ్రంథముద్రణవిషయమున సంపాదకుని కృషిగాని, సహకారముగాని ఈషణ్మాత్రమైనను లేదని ఇందుమూలముగా పాఠకులకు మనవిచేసికొనుచు, మాటదక్కించుకొనుటకు ఆస్కారమిచ్చి ఆశీర్వదించిన శ్రీగురుదేవుల అవ్యాజకరుణకు కృతజ్ఞతాపూర్వకముగ అసంఖ్యాక సాష్టాంగ వందనముల నర్పించుచున్నాను.

భవిష్యత్తులోనైనను ఈగ్రంథమాలకు తగిన ఆర్థికస్తోమత నేర్పాటుచేసి, సంపాదకునిఉత్సాహమునకు తగినంతగా కృషిచేయుటకు పాఠకులు అవకాశ ఆస్కారములను కల్పింతురని విశ్వసించుచున్నాను.

ముముక్షుజన గ్రంథమాలా
కార్యాలయము,
ఏలూరు.

ఇట్లు
ముక్తివి ఉడయవర్.
సంపాదకుడు.

ఓం శ్రీ పరమాత్మనే నమః

# గు రు స్తు తి.

జ్ఞాన భక్త్యాది సంపన్నం
బ్రహ్మవిదామనుత్తమం।
సంపత్కుమార మౌనీంద్రం
సతతం సముపాస్మహే॥

యస్యానుగ్రహ మాత్రేణ
విధ్వస్తదురితోఽస్మ్యహం
తస్య సంపత్కుమారస్య
చరణౌ సముపాస్మహే॥

రామానుజ పదాంభోజ
నిత్యస్థిత మధువ్రతం।
సంపత్కుమార యోగీంద్రం
నిరంతరం భజామ్యహం॥

# ఇష్టదేవతాస్తుతి



సర్వవేదాంత సంవేద్యం
నారాయణం పరాత్పరం।
ప్రపన్నజన సంత్రాణం
వందే బ్రహ్మ సనాతనం॥

సత్యం జ్ఞానం విభుం దేవం
క్షేత్రక్షేత్రజ్ఞనాయకం।
శ్రియఃపతిం హృషీకేశం
సర్వేశం సముపాస్మహే॥

# సరస్వతీ స్తుతి



హృదయసీమను నిల్పి పూజింతునిన్ను
మధురగంభీరభావముల్ పఱఁగ నాదు
వాణియందుననిల్చి యోబ్రహ్మరాణి ?
అమృతవాహిని నీదించుమమ్మ! దయను॥

సాధుజనముల చిత్తముల్ సంతసిల్ల
స్వాదుశబ్దజాలములతో నీదుకరుణ
కమలభవురాణి! అమ్మ! నాకలమునుండి
అమృతవాహిని ప్రవహించిఅలరుగాత!

# వ్యాస స్తుతి



సచ్చిదానంద ఘనుఁడైన శౌరి పరమ
దయనొసంగిన గీతార్థ తత్త్వమెల్ల
హృదయమున నాకు సాక్షాత్కరించుకొఱకు
వ్యాసభగవంతు మదినెంతు నమితభక్తి॥

అచ్యుతాంశసంభూతుఁడై అవతరించి
వేదములచిక్కులెడలించి, విభజనమొన
రించి, బ్రహ్మసూత్రముల రచించినట్టి
వ్యాసభగవంతు భజియింతు నమితభక్తి॥

ఓం శ్రీ పరమాత్మనేనమః

ఓం శ్రీ కృష్ణాయనమః

శ్రీ సంపత్కుమార యతీంద్రాయనమః

# పీఠిక

శ్రియఃపతియును, సకలకల్యాణగుణ పరిపూర్ణుఁడును దయాంబురాశియును, క్షేత్రక్షేత్రజ్ఞ నియామకుండును, బ్రహ్మ రుద్రేంద్రాది సకల సురగణ సేవితచరణ కమలుండును, ప్రణత క్లేశ విభంజనుండును, అప్రాకృత దివ్యమంగళ విగ్రహుండును, నిరతిశయానంద స్వరూపుండును, సకలభువన జన్మస్థితిలయ కారణుండును, మోక్షాధిపతియును, మోక్షప్రదాతయును తృణాదిబ్రహ్మపర్యంత సమస్తవస్తు బాహ్యాభ్యంతర వ్యాప కుండును, శరణాగతరక్షైక దీక్షుండును, ధర్మపరిపాలకుండును, అధర్మనాశకుండును,పరాత్పరుండును, గుణాతీతుండును, గుణాధి పతియును అనంతకోటి భాస్కరప్రకాశుండును నైన నారా యణుని ధ్యానించి,-

యతిలోకనాధులును, శమాదిషడ్గుణ సంపన్నులును జ్ఞాన భక్తి వైరాగ్యములకు సముద్రమువంటివారును, శిష్య వాత్సల్యైక జలధులును, అపరరామానుజులును, మద్గురు నాధులునునైన శ్రీ సంపత్కుమారయతీంద్రులనుసంస్తుతించి,-

పరమాత్మ పాదారవిందములయందలి భక్త్యతిశయ ముచే, బ్రహ్మాధిపత్యమును సైతము తృణప్రాయ ముగఁ

జూచునట్టి పరమవిరాగులును, కేవల కరుణామూర్తులు కనుక చేతనోద్ధరణమే పరమప్రయోజనముగ నెంచి, అవతరించినట్టి వారునునైన శ్రీమద్రామానుజాచార్యుల శ్రీపాదంబుల నౌదల దాల్చి,-

సకల ప్రపన్నజన సముదాయములకును నమస్కరించి,-

సర్వజ్ఞుడును, సర్వశక్తివంతుడును, అఘటనా ఘటన సమర్థుడును, ఆనందమయ స్వరూపుడును, సకలకల్యాణగుణ నాగరుండును, భక్తవాత్సల్యైక జలధియునునైన నారాయణుండు, గోపాలకృష్ణపరబ్రహ్మము నా హృదయమునం దధివసించి, తన సంకల్పముచే నాచేత వ్రాయించు విధమున శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన శ్రీమద్భగవద్గీతో పనిషత్తునకు ముముక్షుజనోపయోగముగా వ్యాఖ్యానము వ్రాయుచున్నాను.

## ప్రతిజ్ఞ

లోకకల్యాణ ప్రదుండైన పరమాత్మ నా యందుండి, ఈ వ్యాఖ్యానము వ్రాయుటకు ప్రేరేపించుటచే నాకు పరమాత్మ తోపించిన విధమున వ్రాయుటకు సంసిద్ధుడనై యున్నాను.

నేను గ్రహించిన అర్థము ఎట్లునాకు సమంజసముగా తోచుచున్నదో, దానికి విరుద్ధమైనవి ఎట్లునాకు అసమంజసములుగా తోచుచున్నవో, వ్యక్తిగత, సంప్రదాయగత రాగ ద్వేషములకు ఏమాత్రమును పాల్పడకుండ వ్యక్తిగత సంప్రదాయగత దూషణలుగాని, అగౌరవ సంభాషణలుగాని

రాకుండ త్రికరణశుద్ధిగ, సాత్త్వికమైన భావములో ముముక్షువుల యెదుటపెట్టుటకే సర్వవిధముల ప్రయత్నించెదను. నాయీకార్యనిర్వహణములో కృతకృత్యుఁడనగునట్లు కరుణాదృష్టులుపఱపి, ఆశీర్వదింపవలసినదిగా, భగవంతుని, పరమ భాగవతులను చేతులుజోడించి వేడుచున్నాను.

శ్రీమద్భగవద్గీతా మాహాత్మ్యమును వర్ణింప బ్రహ్మకును సహస్ర జిహ్వలుగల ఆదిశేషునకునుగూడ వశముకాదన నింక నెవఁడు తెలిసికొనఁగలఁడు? సాక్షాత్పరిపూర్ణావతారమైన గోపాలకృష్ణ పరబ్రహ్మముయొక్క ముఖకమలమునుండి వెలువడినది గీతాగంగాస్రవంతి.

ఈ శరీరమును ప్రాకృతజలముతో కడిగికడిగి శ్రమించి యేమిఫలము? మానవుఁడు ఈ గీతాగంగాజలములోఁ గ్రుంకులిడి, తనివిదీరఁద్రావి, స్థూలసూక్ష్మకారణ శరీరములనెడి మలినమును పోఁగొట్టుకొని, పునరావృత్తి రహితమైన శాశ్వత బ్రహ్మానందము ననుభవించు చున్నాఁడు.

సకల నదులకును సమావేశస్థానము సముద్రమైనట్లు, జడచేతనయుక్తమైన సమస్త చరాచర జగత్తుయొక్క సృష్టికంతకును మూలస్థానము బ్రహ్మమైనట్లు, సమస్త విజ్ఞానములకును నుద్భవస్థానము నిత్యవిజ్ఞానమైనట్లు, సకల దార్శనిక విద్యలకన్నిటికిని సమావేశస్థానము- సార్వభౌమభక్తియొక్క సృష్టికి మూలస్థానము- మోక్షసాధన భూతములైన వివిధ విజ్ఞానములకు నుద్భవస్థానము శ్రీమద్భగవద్గీతయే.

శ్రీమద్భగవద్గీత అనంతములైన రత్నముల కాకరమగు అగాధసముద్రము. ఎవఁడా సముద్రమున మునిఁగి రత్న

ములనన్నిటిని వేసకోఁగలఁడు? ఎన్ని రత్నముల ప్రోగుచేసి కొన్నను, ఆ రత్నములలో కోట్యంశముకూడ తఱుగవు. ఎవరి కెంతవఱకు భక్తికలదో అంతవఱకు రత్నములను మోసికొని పోయి ఆనందింపవలసినదే. తీసినకొలదిని రత్నములు బయలు దేఱుచునే యుండును.

ఇంతవఱకు ఎంతమంది మహాత్ములో ఈగీతకు వ్యాఖ్యానములు వ్రాసియున్నారు. ఎన్నెన్ని భావరత్నములనో మన కందించియున్నారు. కాని, ఎవరును "నేను గీతలోని భావరత్నములనన్నిటిని పొందితిని. ఈ విజ్ఞానరాశి నందుకొంటిని." అని చెప్పగలవారులేరు. నాశక్తికొలఁది పరమాత్మ ఆజ్ఞచేత ఏ స్వల్పరత్నములనో ఏరుకొనప్రయత్నింతును. ఆకొలఁది రత్నములే ముముక్షువులకు ఏకొంచమో ఉపయోగపడినయెడల నేనెంతయో ధన్యుఁడను.

కృష్ణపరమాత్మ ముఖకమలమునుండి ప్రవహించిన అమృతప్రవాహమైన శ్రీగీతాగంగాస్రవంతి నిరతిశయానంద దాయకము. ఇది శ్రీ మహాభారతములో భీష్మపర్వమున హారములో నాయకమణివలె వ్యాసభగవానునిచేత సంఘటింపఁ బడినది.

## ఈ గీతావతరణమునకు మూలకారణము

భారతయుద్ధసమయమున కౌరవ, పాండవ బలములు రెండును, యుద్ధాభిలాషతో ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున చేరి, యుద్ధమునకు సిద్ధముగానుండగా తనకోరికమీఁద కృష్ణపరమాత్మ తనరథమును ఉభయసైన్యములమధ్యకు తోలుకొని

పోయి నిలుపగా, ఉభయసైన్యములను బాగుగా పరిశీలించి చూచిన అర్జునునకు "అయ్యో! ఈ ఉభయసైన్యములలోను గలవారందఱును నాస్వజనము; తాతలు, తండ్రులు, అన్నలు తమ్ములు, కుమారులు, మేనమామలు, మామలు, గురువులు, బావమఱఁదులు మొదలగువారు. వీరినందఱిని చంపుటయా? చంపి పొందునదేమి? ఛీ! యుద్ధముసేయను." అని కలిగిన నిర్వేదము.

ఆ నిర్వేదము విషమసమయములో కలిగినది, అజ్ఞాన జన్యము, అస్వర్గ్యము, అకీర్తికరము నని పరమాత్మనిర్ణయము. కాబట్టి తన కనన్యభక్తుఁడైన పార్థుని ఈవిషమసంకటమునుండి ఉద్ధరింపవలసినబాధ్యతగల కృష్ణపరమాత్మ ఆ యుద్ధరంగమున దివ్యప్రబోధముజేసి, పార్థుని అంతరంగమున జ్ఞానజ్యోతిని వెలిగించి, ఐహికసామ్రాజ్యమునకును పారమార్థికసామ్రాజ్య మునకును అనగా మోక్షసామ్రాజ్యమునకును అర్హునిగా తయారుచేసెను. ఆ దివ్యప్రబోధామృతప్రవాహమే ఈగీత.

ఈ దేశము, ఈకాలము, ఈపరిస్థితి, ఈవ్యక్తి అనుభేదము లేకుండ, సర్వదేశములందును, సర్వకాలములందును, సకల పరిస్థితులలోను, సర్వులకును ఐహికపారమార్థిక సుఖశాంతు లను ప్రసాదించునది ఈ గీతామాత.

కనుకనే వ్యాసభగవానులు "గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైశ్శాస్త్ర సంగ్రహైః। యాస్వయం పద్మనాభస్య ముఖ పద్మాద్వినిస్సృతా॥" అనగా 'గీతయే చక్కఁగా అధ్యయనము

చేయఁదగినది. అట్లు అధ్యయనము చేసిననాడు ఇంక ఇతర శాస్త్రములతో అవసరమేమి? అక్కఱలేదు. మిగిలిన శాస్త్రములకంటె దాని వైలక్షణ్యమేమనగా ఈ గీతాశాస్త్రము కేవలము 'కృష్ణస్తుభగవాన్ స్వయం' అని సాక్షాత్ పరమాత్మ ముఖకమలమునుండి వెలువడినది'. అని చెప్పియున్నారు.

కాబట్టి, ముముక్షువూ! నీకు ప్రకృతి బంధమునుండి బయటపడి, పరమాత్మానుభవ రూపమైన శాశ్వత బ్రహ్మానంద మనుభవించవలయునని ఆపేక్షయుండిన, గీతామృతమును సేవించుము. ఈ గీతామృతము మధురాతిమధురమైన ఒక దివ్యరసాయనము. భవరోగమునకు దివ్యౌషధము.

ఈ రసాయనము కామధేనువునుండి పిదుకబడినది. కృష్ణపరమాత్మ ఉపనిషత్తులను కామధేనువుగా చేసినాఁడు. తానే పిదుకు గొల్లవాఁడైనాఁడు. అర్జునుఁడే దూడ. బుద్ధిమంతులైన ముముక్షువులు భోక్తలు. పాలు గీతామృత దివ్యరసాయనమే. ఇట్టి పరమ దివ్యరసాయనము సులభసాధ్యమైయుండ, దీనిని కాదని ఇతర ఔషధములకు ప్రాకులాడుట వెఱ్ఱితనముకాదా! "సర్వోపనిషదోగావో, దోగ్ధా గోపాలనందనః, పార్థోవత్స స్సుధీర్భోక్తా, దుగ్ధం గీతామృతం మహత్" కనుక ప్రకృతి బంధమునుండి విడివడి శాశ్వత బ్రహ్మానంద మనుభవింప కాంక్షగలవారెల్లరును రండు! ఈ గీతామృతమను దివ్యౌషధమును సేవించి కృతకృత్యులుకండు" అని వ్యాసభగవానులు ఆహ్వానించుచున్నారు.

# గీతలు పఠించు విధమేమి?

గీతలను పఠించునప్పుడు ముందుమహావిశ్వాసము, శ్రద్ధ, భక్తి కలిగి గీతలను సమీపించుము. గీతావక్తయందుగాని, శ్రోతయందుగాని, గీతలలోని విషయమునందుగాని ఏ మాత్రమైన అశ్రద్ధ, అవిశ్వాసము, 'లోపములు కనిపెట్టవలయు'ననెడి తలంపు, తిరస్కారభావము అణుమాత్రమైనను ఉండరాదు. ఈ లౌకికవిజ్ఞానముననే అహంకరించి, 'నా యీ విజ్ఞానపూర్ణమైన బుద్ధితో గీతలను విమర్శింతును' అని గీతలను సమీపించితివో; ఏమియును ప్రయోజనములేదు. భక్తిశ్రద్ధలతో, మహావిశ్వాసముతో గీతామాత చరణాబ్జములకు శరణాగతుఁడవు కమ్ము. అప్పుడు ఆతల్లి అనంతములైన రత్నములకు నిలయమైన తన హృదయద్వారము తెఱచి నీ యెదుట పెట్టును. పరమాత్మ సృష్టిలోని అపారభౌతిక జ్ఞానములో ఏ కోట్యంశమో నీకు తెలియుటతోడనే, నీకు తెలిసినదే సర్వమనుకొని, నీకు తెలియనిది లేనేలేదనెడి భావముతో మోహాంధుఁడవై ఆధ్యాత్మికజ్ఞానభాండారమును విమర్శింపకుము. తనబుద్ధికందని దానిని త్రోసిపుచ్చుటకు ముందంజవేయుటలో ప్రతివారును సమర్థులుగనే ఉందురు. మానవుని బుద్ధిఎంత? విజ్ఞానమెంత? ఇంద్రియములకు, బుద్ధికిఅందనిదిగదా పరమార్థ తత్త్వజ్ఞానము! దానిని తెలిసికొనుటకు బుద్ధిలో రాగద్వేషము లుండరాదు. మనకు తెలియకుండ బుద్ధిలో రాగద్వేషములు దాగియుండును. బుద్ధిని, ఇంద్రియములను ఆధారముగా చేసికొని రాగద్వేషము లుండును. కాబట్టి ఇంద్రియములద్వారమున జరిగిన ప్రతి పని

లోను, బుద్ధిచేయు ప్రతి ఆలోచనమునందును రాగద్వేషముల యొక్క ప్రభావము ఇంతయో అంతయో ఉండకపోదు. రాగద్వేషము లున్నంతవఱకు యథార్థసత్యము తెలియదు. కనుక నీవు భక్తిశ్రద్ధలు, విశ్వాసము కలిగి వినయవిధేయతలతో గీతామాతను ఆశ్రయింపుము. సర్వమును సిద్ధించును.

## మతప్రవర్తకులందఱును గీతనే ఆశ్రయించిరి

పరమార్థవిజ్ఞానము బుద్ధికి అందునదికాదు. కనుక మానవునిబుద్ధి ఆ పరమార్థవిజ్ఞానమును అందుకొనలేదు. పరమార్థవిజ్ఞానవారాశియైన వేదమునే పరమప్రమాణముగా మనము అంగీకరించి, దానిద్వారముననే పరమార్థజ్ఞానము బడయవలయును. వేదము రెండుకాండలుగా నున్నది. కర్మకాండ, జ్ఞానకాండ. జ్ఞానకాండనే ఉపనిషత్తులనియును, వేదాంతములనియును, శ్రుతిశిరస్సులనియును అందురు. ఆ ఉపనిషత్తులన్నియును బ్రహ్మజ్ఞానామృతరసముతో నిండి యుండును.

కాని ఆ ఉపనిషత్తులనుకూడ మానవబుద్ధితో విచారించుట అసంభవముగా నున్నందున ద్వాపరయుగాంతమున ఉపనిషత్ ప్రతిపాద్యమైన ఆ సచ్చిదానంద ఘనపరబ్రహ్మతత్త్వమే యదువంశభాగ్యరాశియై అవతరించి, ఉపనిషత్సారమంతయును- ఒక్కచుక్కకూడ మిగిలిపోకుండ- గీతాపాత్రయందు పట్టి ముముక్షుజనులకొఱకు భద్రముచేసినాఁడు. కనుక ముముక్షువులెల్లరును గీతనే ఆశ్రయించినారు. పరమార్థ

సత్యము తెలియవలయుననిన గీతనే ఆశ్రయింపవలయును. "యాస్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా" గీత కేవలము సాక్షాత్పరబ్రహ్మ ముఖకమలమునుండి వెలువడిన ఒక అమృతధారాస్రవంతి. కనుక గీతలో భ్రమప్రమాదములకు తావు లేదు.

వేదము పరబ్రహ్మముయొక్క నాసికనుండి ఉచ్ఛ్వాస నిశ్వాసరూపముగా వెడలినది. గీత కళ్యాణగుణమహోదధియు సర్వజ్ఞుఁడును, సర్వశక్తివంతుఁడునునగు శ్రీకృష్ణపరబ్రహ్మ ముఖమునుండి వెలువడిన వాగమృతస్రవంతి. వేదమునకును, గీతకును పరమాత్మనుండి వెలువడుటలో సమానమేకనుక మాహాత్మ్యము,. విలువ, సమానమేఅయినను గీతయందు సౌలభ్యముఒకటి విశేషము. కనుక మతప్రవర్తకులందఱు తమతమ మతములను గీతయను నికషోపలముపై గీసి వన్నె కట్టుకొనినారు.

గీతను పఠించుట రెండువిధములు. ఒకటి గీతలో ఏమి చెప్పఁబడియున్నది ? అని దానిలోని సత్యమును తెలిసికొను బుద్ధితో పఠించుట. రెండు తాను ఒక అభిప్రాయము కలిగి యుండి, దానిని సమర్థించుకొనుటకు గీతను ఉపయోగించు కొనుట. మొదటివిధానము ఉత్తమమైనది. రెండవవిధానము ఆచరింపరానిది. రెండవవారు గీతలలోని శ్లోకములకు సహజ ముగా అర్థములుతీయక, తమ తమ భావములను సమర్థించు కొనుటకు తమభావముల కనుగుణ్యముగా విరిచి విరిచి

అర్థములు తీయుదురు. ఆవును పాలుపిదుకువారు సహజముగా పిదుకవలయును. అట్లుపిదికినయెడల చక్కగ పాలులభించును. కాని, బలమున్నదికదాయని అవసరమైనదానికన్న బలమంతయును ఉపయోగించి గట్టిగ పిదికినయెడల పాలకుబదులు రక్తమువచ్చును. అట్లే విరిచి విరిచి అర్థములు తీయుటచే విపరీతార్థములు బయలుదేరగలవు. కాన సక్రమమైన విధానములలో గీతను అధ్యయనముచేసి, దానిలోని సత్యసిద్ధాంతమును గ్రహింపవలయును. కనుకనే వ్యాసులు "గీతా సుగీతా కర్తవ్యా - కిమన్యైశ్శాస్త్ర సంగ్రహైః"అని చెప్పియున్నారు. కాబట్టి ఎవరు ఏ యే మతమును సమర్థించుకొనవలయునన్నను ఆస్తికులు-శాస్త్రములందు విశ్వాసముకలవారు-ఐనచో గీతనే ఆశ్రయింపవలయును. అట్లు అశ్రయించినారుకూడ.

## గీతావక్త

గీతకు వక్త కేవలము 'కృష్ణస్తు భగవాన్ స్వయం' అనఁబడిన, కళ్యాణగుణ మహాంబుధియును, సర్వజ్ఞుఁడును, సర్వశక్తివంతుఁడును, దయామృతరాసియును ఐన కృష్ణపరబ్రహ్మము. 'రామచంద్రమూర్తి అనుష్ఠానావతారము; కృష్ణపరమాత్మ ఉపదేశావతారము' అని కొంతమంది చెప్పుచున్నారు. అది ఒకదృష్టితో చూచిన యథార్థమేగాని, సర్వవిధముల నట్లే తలంపరాదు. ఉపదేశావతారమనగనే కృష్ణపరమాత్మ బోద్ధయేగాని అనుష్ఠానములేనివాఁడని అర్థము తీయుచున్నారు కొంతమంది అల్పమేధస్కులు. అనుష్ఠాన

శూన్యమైన ఉపదేశమునకు విలువఉండునా ? ఎవరు ఏది ఉప దేశించుచున్నారో వారు దానిని అనుష్ఠానమందుంచుకొన్న నే ఆ ఉపదేశమునకు విలువ. లేనియెడల ఎట్లుండుననగా– ఇద్దరు బ్రాహ్మణులు సంభావనకు పోయిరి. అందులో ఒకఁడు సంస్కృత భాషాప్రావీణ్యము, బహుశాస్త్రపరిచయము బాగుగాకలిగి, 'నేను పండితుఁడను' అనుకొనువాఁడు. రెండవ వాఁడు సామాన్యుఁడు. సంభావన ఇచ్చువారు ఈ ఉభయుల కును చెరిఒక రూపాయిని ఇచ్చిరి. అప్పుడు పండితమ్మన్య బ్రాహ్మణుఁడు "ఆత్మస్తుతి, పరనింద, ధనకాంక్ష లేని నాకును ఒకరూపాయియే, ఆశుంఠకును ఒకరూపాయియేనా" అని దెబ్బ లాడినాఁడట. ఆచరణలేని ఉపదేశకులు ఇట్టివారి క్రిందికే చేయుదురు. కృష్ణపరమాత్మ తాను ఎంతచెప్పెనో అంతయును తాను ఆచరించెను. తాను ఏది ఆచరించెనో అదియే చెప్పెను. కనుకనే కృష్ణపరమాత్మ పరిపూర్ణావతారము. రామచంద్రమూర్తి మాయామానుష విగ్రహుఁడు. కృష్ణపర మాత్మ లీలామానుష విగ్రహుఁడు. రామచంద్రమూర్తి తన పరత్వమును దాచుకొని, ఉత్తమ మానవుఁడుగా ఆచరణ యందు చూపించెను. కృష్ణపరమాత్మ తన పరత్వమును ప్రక టించుకొనుచు, దైవత్వమును ఆచరణలో చూపించెను. కనుక సామాన్య మానవులందఱకును రామచంద్రమూర్తి ఆచరణ సరిగా అర్థముచేసికొని, ఆచరించుటకు అందుబాటులో నుంచెను. కృష్ణపరమాత్మఆచరణను మనబుద్ధి అందుకొనలేదు. మనకు కావలసినదానిని కృష్ణపరమాత్మఆచరణలోనుండి

పరికొనుట కష్టసాధ్యము. కనుక మనము ఆయన ఉపదేశ ములే ఆధారములుగా ఆచరణమును రూపొందించుకొన వలయును. జాగ్రత్తగ ఆలోచించిన కృష్ణపరమాత్మ జీవితము లోని ఆచరణఅంతయును, గీతలో చెప్పినదానికి పరమ ప్రమా ణముగా నుండును. మానవజీవితములో నిత్యము గోచరించు ధర్మములు పుత్రధర్మము, శిష్యధర్మము, మిత్రధర్మము, గృహస్థధర్మము, దూతధర్మము మొదలగునవి. వాటిని శ్రీకృష్ణ పరమాత్మ ఎట్లు పాలించెనో చూడుడు.

పుత్రధర్మము:- దేవకీవసుదేవులకు పుత్రుడుగా నవత రించినాడు. కాని వారు కృష్ణపరమాత్మ అవతారకాలమున కారాగారమందు, కాళ్ళకును చేతులకును సంకెలలు వేయఁ బడి, బంధింపఁబడి యుండిరి. పాపము వారు పుత్రుని ఆడించి, పాడించి, అద్దుముద్దుజూచి,అల్లారుముద్దుగా పెంచుకొను భాగ్య మునకు నోచుకోరైరి. ఈ మహాద్భాగ్యము యశోదానందు లకు కలిగినది. అంతకంటె సుకృతవిశేషమేమి కావలయును? సర్వకాల సర్వావస్థలయందును ఆ దంపతులు కృష్ణపర మాత్మను, బలరాముని ఆడించుచుండిరి. కాని యథార్థమాలో చించిన కృష్ణుని వారాడించలేదు. వారినే కృష్ణుఁడు తన ఇష్టమువచ్చినట్లు ఆడించినాఁడు. ఒక క్షణమైనను కృష్ణుని మఱచి యుండలేకుండిరి. కృష్ణుఁడు మరువనిచ్చినగదా! ఆడించి ఒకపరి ఏ పనిమీదనైనను అటుపోయెనో, ఇకచూడుఁడు ఏదియో ఒక అల్లరిపనిచేయుట; 'ఏమిరాకృష్ణా !' అనుచు యశోదమ్మ పరుగెత్తుకొని వచ్చుట; ఇంతే. ఒకక్షణము ఎడ

బోయుటకు వీలులేదుకదా! ఎప్పుడైనను ఇంటిలో పనిచేసి కొనుటకు పోయిన, ఆ కొన్నిక్షణములైనను, 'కృష్ణుఁడు ఎక్కడకు పోయినాఁడో! ఎవరియింటిలో దొంగతనము చేయు చున్నాఁడో! ఏయేతగాదాలు తెచ్చునో!' ఇదే ఆలోచనలలో మునిగియుండును. "ఏమిచేసినావురా కృష్ణా ?, ఎక్కడకు పోయినావురా కృష్ణా? నీళ్లుపోయనా కృష్ణా ? పాలుఈయనా కృష్ణా? దుస్తులు వేయుదునురా కృష్ణా! దుమ్ములో ఆడు కొనకు కృష్ణా! మా కృష్ణుఁడు మీఇంటికివచ్చినాఁడా అమ్మా? మాకృష్ణుని చూచినావా అక్కా? " అనుచు సర్వకాల సర్వావస్థలయందును "కృష్ణా! కృష్ణా! " అను స్మరణయే. కృష్ణునికి నీళ్ళుపోయను, అన్నముపెట్టను, దుస్తులు తొడుగను, కృష్ణుని తిట్టను, కృష్ణుని కట్టను, కృష్ణుని తప్పులు విచారించను యశోదకు సమయము చాలకుండెను. ఈ విధముగ సత్పుత్రుఁడు తల్లిదండ్రుల నెంత సంతోషింపఁజేయుట సాధ్యమో అంత సంతోషమును యశోదానందులకు కలిగించుటకు ఎన్నియో బాల్యలీలల నటించెను. అవి వారిమనసున నెంత వఱకు నాటెనవన, తరువాత కృష్ణపరమాత్మ గోకులమువిడిచి, మథుర, ద్వారకచేరిన తరువాతకూడ, ఆ బాల్యలీలలే తలంచు కొని, తలంచుకొని, వియోగము భరింపలేక, దుఃఖపడినను, అది వారికి ముక్తికే కారణమయ్యెను. కంససంహారమైన పిమ్మట దేవకీవసుదేవుల వద్దకు చేరినపిమ్మట, జీవితమంతయు వారి ఆజ్ఞావశుఁడైయే ప్రవర్తించెను. బాల్యదశలో యశోదా నందులవద్దను తరువాత దేవకీవసుదేవులవద్దను పుత్రధర్మమును, సక్రమముగా నిర్వర్తించెను.

శిష్యధర్మము :—సాందీపునివద్ద శిష్యత్వమును నెరపుచు విద్య నేర్చిన కాలమున తనశిష్యధర్మమును ఎంతనిర్వంచనముగ, నిర్దుష్టముగ నెర వేర్చెనో చూడుఁడు. గురువుసన్నిధానములో అత్యంతభయభక్తులతో గురువునకును, గురుభార్యకును శుశ్రూషలు చేయుచుండెను. తన గొప్పతనమును ఎంత మాత్రమును మనసునకు తెచ్చికొనక అడవికిపోయి, కట్టెలు కొట్టి, నెత్తినమోసికొని వచ్చెడివాఁడు. ఎండయనక, వాన యనక, రాలనక, రప్పలనక, చిన్నదనక, పెద్దదనక, ఉచ్ఛ మనక, నీచమనక సేవలుజేసి, విద్యలగడించి, చివఱకు గురు దక్షిణ సమర్పించి శిష్యధర్మమును నెరవేర్చుకొనెను. ఆదర్శశిష్యుఁడని పేరందెను.

మిత్రధర్మము :—మిత్రధర్మమును నెర వేర్చిన వారందరి లోను అగ్రగణ్యుఁడు శ్రీకృష్ణపరమాత్మ. బృందావనములోని బాల్యదశలో గోపీగోపకులవిషయమున తానుప్రదర్శించిన నిష్కామమిత్రధర్మము పరమాశ్చర్యకరము. ఎన్నెన్ని ప్రమాదపరి స్థితులనుండి, ఎన్నెన్ని విధముల రక్షించినాఁడు! కోపముచేత నింద్రుఁడు కురిపించిన మహాభయంకర శిలావర్షమునుండి గోవర్ధనపర్వతమెత్తి కాపాడినాఁడు, బ్రహ్మమాయనుండి కాపాడినాఁడు. అఘాసురుఁడు పెద్దఅజగరరూపముతో గోప బాలురనందఱను మ్రింగగా అఘాసురుని సంహరించి, వారందఱిని కాపాడినాఁడు. కాళీయుని బారినుండి రక్షించినాఁడు.

పెద్దవాఁడైనతరువాత పాండవులవిషయమున తన మిత్రత్వము ఎంతనిర్వంచనముగ నెరవేర్చినాఁడో చూఁడుఁడు! కేవలము సేవకునివలెనే వర్తించినాఁడన్నచో అతిశయోక్తి ఈషణ్మాత్రమునులేదు. ఉన్నాఁడుగా కర్ణుఁడు; దుర్యోధన మిత్రుఁడు. ఘోషయాత్రలో తన్ను నమ్మికొనియున్న దుర్యోధనుని పుత్రమిత్ర కళత్రాదులతోకట్టి గంధర్వులు తీసికొని పోవుచున్న సమయములో – తాను భుజబలమును చూపించవలసిన సమయములో పిక్కబలమును చూపించి, ప్రాణభీతిచే ఇంటివద్ద దాగినాఁడు. తాను అర్జునునితో గెలువలేనని అనుభవపూర్వకముగా అనేకమార్లు తెలిసికొనికూడ తన డాంబికములచే దుర్యోధనుని మోసగించినాఁడు. తనకక్ష, తన స్వార్థము, తన పేరుప్రతిష్ఠలు చూచుకొనినాఁడు. కాని దుర్యోధనునిమేలు చూచినవాఁడుకాఁడు. సమయమువచ్చినప్పుడు పారిపోవుచుండుట, మఱల దుర్యోధనునితో "నేనుంటినిగా నీకేమియును భయమువలదు." అని అభయమిచ్చుచుండుట; ఇది కర్ణుని మిత్రత్వము. పోనీ, ఇన్నియును తెలిసి తెలిసి, దుర్యోధనుఁడు నమ్ముట ఆశ్చర్యము!

ద్రోణాచార్యులును, ద్రుపదమహారాజును బాల్యస్నేహితులు. అట్టి మిత్రత్వము ఎట్లు పరిణమించినదో చూడుఁడు! ద్రోణుఁడు పెద్దవాఁడైనతరువాత పిల్లవానిపాలకు ఆవు కావలసివచ్చి, తన బాల్యమిత్రుఁడు ద్రుపదుఁడున్నాఁడని ఎంతో విశ్వాసముతోవచ్చి, అవమానముపొంది పోయినాఁడు. కృష్ణపరమాత్మ మిత్రత్వమట్టిదా? మిత్రధర్మములన్నియును

హృదయపూర్వకముగనిర్వహించినఆదర్శమిత్రుఁడుశ్రీకృష్ణుఁడు. కుచేలుఁడు, కృష్ణపరమాత్మ ఒకగురువువద్ద విద్యనభ్యసించిరి. ఆ కాలమునవారు చాల మిత్రులుగా నుండెడివారు. విద్యాభ్యాసము పూర్తిఅయినపిమ్మట చాలకాలము గడచిపోయెను. కుచేలుఁడు చాల బీదతనమున బాధపడుచుండెను, బహు సంతానము. తినుటకు సరియైన తిండి, కట్టుటకు సరియైన గుడ్డ కూడ లేకుండెను. కాని కుచేలుఁడు మహాభక్తుఁడు. ఈ దారిద్ర్యబాధ ఆతనిని ఏమాత్రమును చలింపఁజేయలేకుండెను. ఆయనభార్య మహాపతివ్రత. ఆమె పిల్లలకుకూడ కడుపునిండుగ తిండి లేకుండుటచూచి ఓర్వలేక, భర్తయొద్దకుపోయి "మీకు బాల్యమిత్రుఁడు కృష్ణపరమాత్మఅని వింటిని. ఆయన మహదైశ్వర్య సంపన్నుఁడై యుండెనుగదా! ఒకసారి మీరు పోయి దర్శించిన మీకు సహాయము దొరుకదా!" అని అనేక విధముల పోరగా, భార్యాబలవంతమున 'పోనీ, ఈ రూపముననైనను నాబాల్యమిత్రుని ఒకసారి చూచివచ్చు అదృష్టము కలిగినది.' అని బయలుదేరి వెళ్ళినాఁడు కుచేలుఁడు. త్రోవలో ఆలోచించుకొనుచున్నాఁడు. కృష్ణుని దర్శనముఅగునా? ద్వారపాలకులు నన్ను లోనికి పోనిత్తురా? ఆ మహాలులో అడుగుపెట్టుటకు నాకధికారముండునా?" ఇట్లు ఏవేవో ఆలోచించుకొనుచు, ద్వారమువద్దకు వచ్చునప్పటికి కుచేలుఁడు వచ్చుచున్నట్లు కృష్ణునకు తెలియగనే, అకస్మాత్తుగ, ఆతురతతో హంసతూలికాతల్పమునుండి దూకి, పరుగు పరుగున ఎదురేగి, చెమటలుకారు శరీరమును తన పట్టుపీతాంబరముల

తోడనే కౌగిలించుకొని, లోనికి అత్యాదరముతో తీసికొని వచ్చి, సింహాసనముపై కూర్చుండబెట్టి, కాళ్ళుకడిగి, శిరముపై చల్లుకొని, భార్యల శిరములపై జల్లి మహలంతయు మూల మూలల చల్లి, కుచేలుని తాను పరుండు హంసతూలికా తల్పముపైన పరుండఁబెట్టి, రుక్మిణీ సత్యభామాదులు వింజామరలువీవ, తాను పాదములొత్తుచు కుశలప్రశ్నలు వేయుచుండెను. మహదైశ్వర్యమును ప్రసాదించెను. మిత్రుఁడన కృష్ణుఁడే మిత్రుఁడు. పాండవులకు తన కష్టసుఖములు జూచుకొనక తనకీర్తి ప్రతిష్ఠలయందు దృష్టిలేక, అవసరము కలిగిన యెడల తన నియమములకును, వ్రతములకును భంగముకలిగినను, కేవలము మిత్రకార్యమునే ప్రధానముగ నెంచుకొని వ్యవహరించెను. అర్జునునికి సారథ్యము చేసినాఁడు. రథాశ్వములను కడుగుట, మేపుట, మొదలగుచర్యలు స్వయముగా ఆయనయే చేయువాఁడు. ఇట్లు చేయుటకు ఎంత అహంకార రాహిత్యముండవలయునో, పాండవులయందు ఎంతప్రీతియుండవలయునో ఆలోచింపుఁడు! పాండవులను ఎన్నెన్ని ఆపత్సమయములందు రక్షించెనో! ద్రౌపదిని నిండుసభకు లాగుకొని వచ్చినప్పుడు, దుర్వాసుఁడు సశిష్యుఁడై అడవిలో అతిథిగా వచ్చినప్పుడు, భగదత్తుఁడు వైష్ణవాస్త్రమును ప్రయోగించినప్పుడు, కర్ణుఁడు నాగాస్త్రము వేసినప్పుడు, సైంధవవధ సమయమున, ఇంకను ఇట్టి అనేక ఆపత్సమయములలో కంటికి రెప్పవలె కాచిరక్షించెను. ఇట్లు మిత్రకార్యమును సక్రమముగా నెఱపినవారు కలరా కృష్ణుఁడుతప్ప ?

గృహస్థధర్మము :— గృహస్థధర్మమునుకూడ ఏ లోపములునులేక పూర్ణముగ నిర్వహించెను. తనకు గలిగిన భార్యలందఱి విషయమునను సమభావముతో మెలగి దక్షిణనాయకుఁడని పేరుపొందెను. అతిథుల నభ్యాగతుల నాదరించెను.

ధర్మసంరక్షణార్థము దుష్టశిక్షణ జేసెను. శత్రుత్వము పాటించువాఁడుకాఁడు. తప్పనిసరియైనప్పుడు సంహరించుటయే కాని, ఊరక శత్రుత్వమును పురస్కరించుకొని ఎవరిని చంపినవాఁడుకాఁడు. నరకాసురునిజంపి ఆ రాజ్యము ఆతని కుమారుఁడైన భగదత్తునికిచ్చెను. శిశుపాలునిజంపి, ఆరాజ్యము అతని కుమారునకే ఇచ్చెను. అట్లే జరాసంధాది దుష్టులను సంహరించుట. ఆ సంహరించుటలో దుష్టశిక్షణమును ధర్మరక్షణమును మాత్రమే సంకల్పముకాని స్వార్థమీషణ్మాత్రమును లేదు.

దూతధర్మము :— పాండవులపక్షమున కౌరవసభకు దూతగాపోయినప్పుడు నిర్వంచనముగ నిర్దుష్టముగ ప్రయత్నించి, తన ధర్మమును నెరవేర్చుకొనెను. 'కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన' అను ధర్మమునెంతో జాగరూకతతో పాలించినాఁడు. ప్రయత్నలోపము ఏమాత్రము చేయలేదు. ఎవరితో, ఏమేమి, ఎంతెంతవఱకు, ఎట్లెట్లు చెప్పవలయునో వారివారితో, అన్నియును, అట్లే చెప్పెను. సామదాన భేదములన్నియును ప్రయోగించెను. సామముగా వారి తప్పులు తెలిపెను. దానముగా 'రాజ్యమంతయును

మీారే తీసికొనుఁడు; అయిదు ఊళ్ళిచ్చినచాలును' అని చెప్పి చూచెను. భేదముకూడ ఉపయోగించిచూచెను. కర్ణునితో సంభాషించెను. కృష్ణునకు సంధికుదురదని తెలియును. అంత ర్యమున ఇష్టముకూడ లేకపోవచ్చును. కాని ప్రయత్నములో మాత్రము ఎంతమాత్రమునులోపములేదు. కృష్ణపరమాత్మ ఏ ఘడియలలో అవతరించెనోకాని, ప్రతివిషయములోను ఆయన ఆచరణను శంకించుటయే కలుగుచున్నది. కాని జాగ్రత్తగ వాసనారహితబుద్ధితోఁ జూచిన ఆయనయొక్క చరిత్ర అర్థముకాగలదు. ఆకృష్ణభగవానుని పవిత్రవాణి ఈగీత.

## భగవద్వాణి - దానిమహిమ

భగవద్వాణి అత్యంత మహిమకలదిగా నుండును. భగవద్వాణి ఒకప్పుడు, ఒక వ్యక్తికొఱకు ఏకదేశముగా ఉపదేశించినట్లు కనుపడినను, అది అన్నికాలములలోను, అన్ని దేశములలోను, అన్నిపరిస్థితులలోను, అందరికిని, వారివారి అధికారమును బట్టి సదర్థములే ప్రసాదింపఁగలదు. ఒకప్పుడు దేవతలు, మానవులు, దానవులు బ్రహ్మవద్దకు శిష్యభావముతో శిక్షపొందుటకు పోయిరి. నియమముతో బ్రహ్మచర్యమును పాలించుచుండిరి. వారిదీక్షపూర్తిఅయినతరువాత సంతోషించి బ్రహ్మ 'మీాకేమి కావలయును?' అని అడిగెను. అప్పుడువారు 'ప్రభో! మాకేది కావలయునో దానిని ఉపదేశింపుఁడు' అని ప్రార్థించిరి. దేవతలను, మానవులను, దానవులనుకూడ ఉద్దేశించి ఒకేఒక అక్షరమును ఉపదేశించెను. అది 'ద' అన్న

అక్షరము. తరువాత బ్రహ్మవారి ముగ్గురనుకూడ విడివిడిగా అడిగినాడు. 'మీరు ఈ 'ద' అనగా ఏమి అర్థము చేసినారు?' అని. అప్పుడు దేవతలు చెప్పిరిగదా– 'ప్రభో! మేము దేవతలము. అనగా భోగప్రియులము. మాకు ఇక వృద్ధాప్యమనునది లేదు. కనుక ఇంద్రియములద్వారమున విషయము లనుభవించి, ఆనందించుటయే పరమ ప్రధానముగా ఎంచుకొనుచున్నాము. కనుక మాకు 'ద' అనగా దమమును ఉపదేశించినారు. (ఇంద్రియముల జయించుటయే దమము) అని చెప్పినారు. 'భేష్ ! బాగుగ గ్రహించినారు.' అని బ్రహ్మ సంతోషించినాడు. తరువాత మానవులను అడిగినాడు. వారు ప్రభో ! మేము ఎంత వఱకును కర్మచేయుటయును, ధనమును సంపాదించుటయును, పరమ ప్రధానముగా నెంచుచుందుము. కనుక మాకు 'ద' అనగా 'దానము'ను ఉపదేశించినారు' అని చెప్పినారు. బ్రహ్మ సంతోషించి దానవులనుఅడిగినాడు. దానవులు 'ప్రభో! మాకు క్రూరత్వము ప్రధానముగానున్నది. ఇతరులను హింసించుట, నరుకుట, బాధించుట, వేధించుట ఇవే పరమప్రధానములుగా నున్నవి. కనుక మాకు 'ద' అనగా 'దయ' అని ఉపదేశించినారు' అని చెప్పినారు. బ్రహ్మ ఆనందభరితుడైనాడు. బ్రహ్మ ఈ ముగ్గురకును ఉపదేశించినది ఒకే అక్షరము. కాని ముగ్గురును వారివారి అధికారమునుబట్టి వేఱువేఱు అర్థములు తీసికొనినారు. అదిసమంజసమే. అది వారికి కళ్యాణదాయకమే అయినది. ఇది మహాత్ముల వాణిలోనున్న మహిమము. ఇక భగవద్వాణినిగుఱించి ఎంతని చెప్పగలము? అట్టి భగవద్వాణి

గదా ఈ గీత! ఇక గీతసర్వశాస్త్ర మయమైన దనుటలో అతిశయోక్తి ఉండునా? కాబట్టి గీత అన్ని కాలములందును, అన్ని దేశములందును, అన్ని పరిస్థితులలోను, అందఱకును కళ్యాణదాయకమే కాగలదు. అన్ని తరగతులవారికిని, వారి వారి అధికారమునకు తగినట్లు, ప్రబోధమును కలిగించి, కళ్యాణ పథమున నడిపించి సర్వులకును గమ్యస్థానమైన భగవత్ప్రాప్తిని కలిగించును. భ్రమప్రమాదరహితమైన గ్రంథము గీత. దీనిని కేవలము మానవుఁడు తన బుద్ధిబలము మీఁదను, లౌకిక విజ్ఞానము మీఁదను, భాషాప్రావీణ్యము మీఁదను, బహుశాస్త్ర పరిచయముమీఁదనుఆధారపడి అంతమాత్రమున కేఅహంకరించి, విమర్శాదృష్టితో అధ్యయనము చేసినయెడల, సత్త్వరజస్తమో గుణప్రవాహమైన ఈమాయయొక్క సుడిగుండములో తగుల్కొన వలసినదే. భగవంతుని విశ్వసించి భగవంతునియందే భారము వైచి, ఆయనకే శరణాగతుఁడై, భగవద్వాణియైన ఈ మహోత్కృష్ట గీతాగ్రంథమును విధివిధానము ప్రకారము, అధ్యయనము చేసినచో గీతలోని యథార్థము అరచేతిలోని ఉసిరికపండువలె సాక్షాత్కరించును.

## గీత యోగ శాస్త్రము

గీతయొక్క ప్రతి అధ్యాయమునకును చివర "ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం, యోగ శాస్త్రే" అని ఉన్నది. గీత 'యోగశాస్త్ర'మని చెప్పఁబడి యున్నది. గీత యోగశాస్త్రమెట్లు అయినది? గీతలో

చెప్పఁబడిన యోగమేమి? అని పరిశీలింపవలయును. యోగ సంప్రదాయమునకు మూలగ్రంథమైన పాతంజలి యోగ సూత్రములలో 'యోగశ్చిత్తవృత్తి నిరోధః' 'యోగమనగా చిత్తవృత్తులను నిరోధించుట' అని చెప్పఁబడి యున్నది. యోగ సూత్రములలోని యోగముయొక్క ప్రయోజనము కేవలము చిత్తవృత్తులను నిరోధించుటమాత్రమే. యోగసంప్రదాయము ప్రకారము మానవుని గమ్యస్థానము 'ముక్తి.' అనగా 'ఆత్యంతిక దుఃఖనివృత్తి'. ఎంతమాత్రమును దుఃఖలేశము కూడ లేకుండుటయేఅని సిద్ధాంతము. అయితే, ఇట్టిస్థితిమనకు రావలయుననిన దుఃఖమునకు కారణము ఏమి? అని ఆలోచించవలసి యున్నది. దుఃఖములకు కారణము చిత్తమే. చిత్తము యొక్క వృత్తులు ప్రపంచ విషయములవైపు ప్రవహించుటయే దుఃఖమునకు కారణము. కనుక దుఃఖములు లేకుండ నుండవలయుననిన చిత్తవృత్తులను ప్రపంచ విషయ ముల వైపునకు పోనీక నిరోధించవలయును. అట్లు నిరోధించిన ఇక ఆ దుఃఖము పూర్తిగ నివృత్తి యగును. కనుక పాతంజలి యోగము 'దుఃఖ నివృత్తికి ఏకైక ఉపాయము చిత్తవృత్తి నిరోధమే' అని నిర్ణయించుటచే, యోగము యొక్క ప్రయోజనము చిత్తవృత్తి నిరోధము.

కాని, గీతయొక్క ప్రయోజనము అంతమాత్రమే కాదు. గీతలో చెప్పఁబడినయోగమునకు అర్థము చిత్తవృత్తి నిరోధము మాత్రమేకాదు. ప్రయాణము చేయవలయుననిన, గుఱ్ఱము కావలయును. గుఱ్ఱముతో పాటు మిగిలిన సౌకర్యములు

జీను, రికాబులు, కళ్ళెము మొదలగున వన్నియును, ఉండును. కనుక ప్రయాణమునకు సాధనము 'గుఱ్ఱము' అనవలయును. గుఱ్ఱమునే ఆశ్రయించవలయును. కాని ఒకరు 'ప్రయాణమునకు జీను పరికరము' అనిన ఎట్లుండును? జీను ప్రయాణమును చేయుటలో సౌకర్యముగా ఉపకరించు ఒకపనిముట్టు. అంతే గాని, దానిచేతనే ప్రయాణము సాగదు. గుఱ్ఱమే ప్రయాణోప యోగమైనది. గుఱ్ఱములేకుండ ఒక జీనుతో ప్రయాణము చేయఁగలఁడా? అయితే 'జీనులేకుండా గుఱ్ఱముతో ప్రయాణము చేయఁగలఁడా?' అని ప్రశ్నించవద్దు. ఆ ప్రశ్న తెలివిగలవారు వేయతగినదికాదు. గుఱ్ఱముతో జీనును ఉండును. ఒకవేళ వాదనకొఱకు మాట్లాడినను, జీనులేకపోయిన సౌకర్యము తక్కువయే కాని ప్రయాణమున కభ్యంతరమేమి? అంత దూరము అతివాదము చేయరాదు. గుఱ్ఱముతోపాటు జీనును సిద్ధించును. ప్రయాణ పరికరమైన గుఱ్ఱమును ఆశ్రయించు నప్పటికి ఆ గుఱ్ఱము యొక్క ఏర్పాటులోనే జీనుకూడ ఉండును. కనుక ఒక్క జీనుకొఱకు ప్రత్యేకముగా ప్రయత్నము చేసి ఆ ఒక్కజీనుతోనే ప్రయాణము నెరవేరు ననుకొనుట, మన మనుకొనఁ దగినదికాదు.

ప్రశ్న:- జీనుకొఱకు వేరే ప్రయత్న మక్కఱలేకపోయిన మానె జీను అవసరమని ఒప్పుకొనినారుకదా! ఇంకేమి? మీరు కూడ పాతంజలియోగమును ఒప్పుకొనినట్లేగదా!

సమాధానము:- నాయనా! మాకు పతంజలి అనిన విరోధములేదు, ఆయన మాకు ఆదరణీయుఁడు. నీవు పొరపాటు

పడు నదెచ్చటననిన, ఈఉపమానములో జీనుఅనగా యోగము కాదు. చిత్తవృత్తి నిరోధరూపమైనఫలము. యోగముచేత చిత్తవృత్తి నిరోధము లభించుచున్నది. చిత్తవృత్తి నిరోధమునకు ప్రయత్నము చేయుట యోగము. కాబట్టి మేము చిత్తవృత్తి నిరోధరూపమగు ఫలమును నిషేధించుట లేదు. దానికి ప్రత్యేకసాధనమైన పాతంజలి యోగమును మాకు అనవసరమనుచున్నాము.

'ప్రయాణమునకు మీకు రాజుగారు గుఱ్ఱము పంపించినార'నిన నేను మరల ఎవరి దగ్గరకైన పోయి, పలు బాధలుపడి, జీను సంపాదించుకొని అది చంకలో పెట్టుకొని పోవలయునా? అది ఎంత తెలివి తక్కువ? గుఱ్ఱముతోనే జీనువచ్చును. ఆ సౌకర్యముతోనే, రాజాగారు గుఱ్ఱము పంపించెదరు. కనుక జీనుకొఱకు వేరేప్రయత్నము కూడ అక్కరలేదు. 'ఆ ఒక్కజీనుతోనే పని అగునని అనుకొను వారు సంపాదించుకొనవచ్చును. గీత అన్ని సౌకర్యములు కల ఉపాయమును చెప్పుచున్నది. ఆ ఉపాయమే గీతయొక్క యోగము. ఆ యోగము పాతంజలి యోగముకంటె అత్యంతము విలక్షణమైనది. గీతాప్రతిపాదితమైన యోగము నకు లక్ష్యము భగవత్ప్రాప్తి. పాతంజలియోగమునకు లక్ష్యము చిత్తవృత్తి నిరోధము. మోక్షమనగా, 'కేవలము ఆత్యంతిక దుఃఖనివృత్తి మాత్రమే' అను వారికి పాతంజలి యోగము చాలును. చిత్తవృత్తులు పూర్తిగ నిరోధించబడిన నాడు దుఃఖ నివృత్తి అగుటలో సందేహములేదు, మనో

వృత్తులు ఇంద్రియములద్వారమున ప్రాపంచిక విషయములందు ప్రవహించిననేగాని ప్రపంచము యొక్క అనుభవమురాదు. ప్రపంచము అనుభవములోనికి వచ్చిననేగాని దాని లక్షణమైన దుఃఖము లభించదు. దుఃఖాలయము ఈ ప్రపంచము. కనుక ఈ దుఃఖాలయమైన ప్రపంచమందు మనోవృత్తులు సంచరించనీయక నిగ్రహించవలయును. అట్లు నిగ్రహించ గలిగిననాడు ప్రపంచముయొక్క దుఃఖము అనుభవమునకురాదు.

ఉదాహరణము – వైద్యుఁడు మత్తుమందు ఇచ్చి, తరువాత శరీరమును శస్త్రములతో కోసినను బాధ తెలియుటలేదు. మత్తుమందు ప్రభావము పోయిన తరువాత మరల బాధ తెలియుచున్నది. కారణము? అప్పుడు చిత్తము చేష్టారహితమై మొద్దుబారిపోవుటచే దాని వృత్తులు అణగిపోయినవి. కనుక బాధ తెలియుటలేదు. అట్లే యోగప్రభావముచేత చిత్తవృత్తులునిరోధింపఁబడినప్పుడు ప్రపంచము, దుఃఖము తెలియదు. కాబట్టి ఆసమయములో దుఃఖనివృత్తిఅగును. మత్తుమందుచేత కలిగిన వృత్తినిరోధము తాత్కాలికము; అక్రమ విధానము. తాత్కాలికము కనుక మరల మనస్సు చేష్టావంతమగుటయు, దుఃఖము తెలియుటయు ఉన్నది. సక్రమమైన పద్ధతులలో యోగము సాధించిన వారికి కలిగిన చిత్తవృత్తి నిరోధమునకు మరల భంగములేదు. కనుక మరల దుఃఖము అనుభవమునకు రాదు. కాబట్టి దానిని ఆత్యంతిక దుఃఖనివృత్తి అన్నారు. మత్తుమందుచేత కలిగిన దానిని 'ఆత్యంతిక దుఃఖనివృత్తి' అనఁలేదు, అది తాత్కాలిక దుఃఖనివృత్తి. యోగము యొక్క

ఫలము ఆత్యంతిక దుఃఖనివృత్తి. మత్తమందుచేత మనోవృత్తుల నటకాయించుట అక్రమము. యోగముచేత నిరోధించుట అక్రమముకాదు కాని, బలాత్కారము. గీతా ప్రతిపాదిత యోగములో చిత్తవృత్తి నిరోధము సహజముగా కలుగును. కాని ఈ యోగము యొక్క లక్ష్యము అదికాదు. దీని ప్రయోజనము ఆత్యంతిక దుఃఖనివృత్తి మాత్రమేకాదు. ఈ యోగములో చిత్తవృత్తి నిరోధము సహజముగా ఎట్లుకలుగునో, అట్లే దానిఫలమైన ఆత్యంతిక దుఃఖ నివృత్తికూడ కలుగును. దాని ప్రయోజనము సచ్చిదానంద ఘనపరబ్రహ్మమును పొందుట, శాశ్వత బ్రహ్మానందప్రాప్తి. కనుక గీతాయోగము, ప్రయోజనము, అన్నియును అత్యంత విలక్షణములైనవి అని మాత్రమే ఇక్కడ ప్రతిపాదించ దలంచినది. ప్రస్తుతమస్తు.

## గీత - ఉపనిషత్తే

శ్రీ భగవద్గీత ఉపనిషత్తే. ప్రతి అధ్యాయమునకును చివర "శ్రీభగవద్గీతాసూపనిషత్సు" అని యున్నది. ఈపారము పరంపరగా అనాదినుండియును ఆచారముగా వచ్చుచున్నది. వ్యాసభగవానులే ఇట్లు పఠింపించియుందురనుట నిర్వివాద మని మా అభిప్రాయము. "ఉపనిషత్తులు అపౌరుషేయములు. పౌరుషేయములు అయిన గ్రంథములు ఉపనిషత్తులుకానేరవు. భగవద్గీత శ్రీకృష్ణునిచేతపలుకబడినది గనుక పౌరుషేయమే. అపౌరుషేయమెట్లుకాగలదు ? 'స్మృతి' యనవచ్చును." అని

కొందఱివాదము. 'స్మృతి' అని అనుటలోమాకెట్టి అభ్యంతరము లేదుగాని, 'ఉపనిషత్తు' అనికూడ అనవలెను. పరిపూర్ణ పరబ్రహ్మవస్తువే లీలామానుష విగ్రహుఁడుగా అవతరించి చెప్పుటచేత దీనిని 'స్మృతి'అని అనుటలో ఏమియు అభ్యంతర ముండదు. లీలామానుష విగ్రహుఁడుగా అవతరించినను, ఆ వస్తువు పరిపూర్ణబ్రహ్మవస్తువే కనుకను, ఆయనగీతలో కూడ "ద్వావిమౌపురుషౌ లోకే – క్షరశ్చాక్షర ఏవచ" అనిచెప్పి, తరువాత "యస్మాత్ క్షరమతీతోఽహమక్షరాదపి చోత్తమః, అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః". అని చెప్పుకొని యున్నాఁడు. కనుక లోకములో పురుషులు ఇద్దరే కలరనియును, ఆపురుషులిద్దరికంటెను నేను విలక్షణమైన వాఁడను,ఉత్తముఁడనుకాబట్టి నేను'పురుషోత్తముఁడ'ననియును చెప్పుకొని యున్నాఁడు.'పురుషోత్తమః, పురుషాభ్యాం ఉత్తమః పురుషోత్తమః' అని విగ్రహము. కనుక శ్రీకృష్ణపరమాత్మ సామాన్యముగా లోకమునందు చెప్పఁబడు పురుషుఁడుకాఁడు. కనుక ఆయనచేత చెప్పఁబడినగీత పౌరుషేయముకాదు. కాన ఉపనిషత్తే. "కృష్ణస్తుభగవాన్ స్వయం"అని శ్రీభాగవతము, "బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః, సర్వ భూతస్థ మేకోనారాయణః కారణరూప మకారపరబ్రహ్మోం". అని నారాయణోపనిషత్తు. కనుక కేవలము సచ్చిదానందఘన పరబ్రహ్మ ముఖకమలమునుండి వెలువడిన గీతాస్రవంతి పరబ్రహ్మనాసికలనుండి ఉచ్ఛ్వాస నిశ్వాసల రూపమున బయలువడిన వేదముకంటె ఏ విషయమునను విలువలో

తక్కువకాదు. తక్కువ అనుకొనుట గొప్ప అపచారము కాగలదు. విషయము చూచినను, 'ఉపనిషత్సారమేగీత.' "సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః పార్థోవత్స స్సుధీర్భోక్తా దుగ్ధంగీతామృతం మహత్".ఉపనిషత్తులయొక్క యధార్థ తత్త్వమును తెలియలేనిస్థితికి మానవులు వచ్చుటచేత, మానవులయందు పరిపూర్ణానుగ్రహము కలిగి ఆ పరబ్రహ్మ వస్తువే,యదువంశ భాగ్యరాశియై, సాక్షాన్మన్మథమన్మథుడై, లోకకళ్యాణ ప్రదమైన దివ్యమంగళ స్వరూపముతో అవత రించిన శ్రీకృష్ణ పరబ్రహ్మము, ఆ ఉపనిషత్తుల యధార్థసారము గీతగా ప్రసాదించినాడు. కాన ఈ గీతలో వేదముకంటె, సౌలభ్యగుణము ఒకటి అధికముగాకలదు. సౌలభ్యగుణ మున్న చోట సామాన్య ప్రపంచములో విలువతగ్గును. గీతను ఉపని షత్తనకపోవుట కిదే కారణమై యుండవచ్చును.

ఒకే ఒక సమర్థుడైన వ్యక్తి భారతదేశమునకు ప్రధాన మంత్రిగాను,కాంగ్రెసు సంస్థకు అధ్యక్షుడుగాను ఉండవచ్చును కదా! ఇట్లే ఈ గీత అటు ఉపనిషత్తుగాను, ఇటు స్మృతిగాను అధికారము కలిగి యున్నది. కాన, పరమార్థ విజ్ఞానము నందభిలాష కలవారు విజ్ఞానభాండారమైన ఈ గీతనే ఆశ్ర యించవలయును. "గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రసంగ్రహైః యాస్వయం పద్మనాభస్య ముఖపద్మాద్విని స్సృతా" అని చెప్పినారు వ్యాసభగవానులు. భూదేవితో విష్ణుమూర్తి చెప్పినాడు "గీతామే పరమా విద్యా బ్రహ్మ రూపా నసంశయః అర్థమాత్రాక్షరా నిత్యాసా నిర్వాచ్యపదా

త్మికా" అని. ఇందు గీతయొక్క స్వరూపమును తెలియజేసినారు. గీతయొక్క మహిమను చెప్ప నింతకంటె నింక ఏమికావలయును!

దు ర్ము ఖ సం క్రాం తి } సకలమానవ సేవకుఁడు,
శ్రీ కృ ష్ణా శ్ర మ ము } సీ తా రా ం.



ఓం శ్రీ పరమాత్మనేనమః

# శ్రీమద్భగవద్గీతా - ప్రథమోఽధ్యాయః

## అర్జున విషాదయోగః

ధృతరాష్ట్ర ఉవాచ –

శ్లో. ధర్మక్షేత్రే కురుక్షేత్రే
సమవేతా యుయుత్సవః
మామకాః పాణ్డవాశ్చైవ
కిమకుర్వత ? సంజయా !

ప. ఛా. ధర్మక్షేత్రే, కురుక్షేత్రే, సమవేతాః,
యుయుత్సవః, మామకాః, పాండవాః,
చ, ఏవ, కిం, అకుర్వత, సంజయ.

క:–

సంజయ=ఓ సంజయుఁడా !
ధర్మక్షేత్రే=ధర్మభూమియైన,
కురుక్షేత్రే=కురుక్షేత్రమునందు,
సమవేతాః=సమావేశమైనట్టియును,
యుయుత్సవః=యుద్ధమునం దభిలాష కలిగినట్టియును,
మామకాః=నావారును,
పాండవాశ్చైవ=పాండవులును,
కిం=ఏమి ?
అకుర్వత=చేసిరి.

ధృతరాష్ట్రుఁడు అడుగుచున్నాఁడు.

తా. ఓసంజయా! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున నావారైన దుర్యోధనాదులు, పాండురాజు కుమారులైన ధర్మరాజాదులు యుద్ధముసేయ సంకల్పము కలవారై గుమిగూడినారు ఏమిచేసినారు ? (అని)

## అమృతవాహిని :-

ధృతరాష్ట్రుఁడు, పాండురాజు అన్నదమ్ములు. ధృతరాష్ట్రుఁడు పుట్టుగ్రుడ్డి. ఆ హేతువుచే ఆతనికి రాజ్యాధికారము లేకుండపోయినది. పాండురాజునకే పట్టాభిషేకము చేసి, సింహాసన మెక్కించినారు. పాండురాజు అన్నగారిమీఁది భక్తి విశ్వాసములచేత, సింహాసనము మీఁద అన్నగారినే అధిష్ఠింపఁజేసి, తన బాహుబలశౌర్య పరాక్రమములచేత రాజ్యమును విస్తరింపఁజేయుచు, ప్రజలను కన్నబిడ్డలవలె చూచుచు న్యాయముగా పరిపాలన చేయుచుండెను. కొంత కాలమునకు పాండురాజు కారణాంతరములచే అరణ్యావాసము నేర్పఱచుకొని, తపస్సు చేసికొనుచుండగా కాలక్రమమున నాతనికి కుంతివలన ముగ్గురు కుమారులును, మాద్రివలన ఇద్దఱుకుమారులును కలిగిరి. ధర్మరాజు, భీముఁడు, అర్జునుఁడు, నకులుఁడు, సహదేవుఁడు అని వారిపేర్లు. ఇక్కడ ధృతరాష్ట్రునికి నూఱుమంది కుమారులు కలిగిరి. వారే దుర్యోధన దుశ్శాస నాదులు. ధర్మరాజాదులు పాండురాజు కుమారులగుటచే వారికి పాండవులని పేరువచ్చినది. పాండవుల చిన్నతనమునందు శాపవశమున, పాండురాజు అరణ్యముననే చనిపోయినాఁడు. మాద్రిభర్తతో సహగమనము చేసినది. మహర్షులందఱు

కుంతిని సహగమనము చేయకుండ ఆపి, ఓదార్చి, జ్ఞానోప దేశమునుచేసి 'ఈ బాలురను జాగ్రత్తగా పెంచవలసినది' అని ఆదేశించినారు. ఆ మహర్షుల ఆదేశము ప్రకారము కుమారుల నయిదుగురను తీసికొని ఆమెహస్తినాపురము వచ్చినది. ధృతరాష్ట్రుడు కూడ భీష్ముని ఉపదేశమున తమ్ముని బిడ్డలను ప్రేమతో పెంచి, విద్యలు చెప్పించి పెద్దవారిని చేసినాడు. చిన్నతనమునుండియును పాండవులు అన్నివిధములను సమర్థు లగుటచే దుర్యోధనాదులకు వారియందు అసూయ పెరిగినది. వారిలోను భీమార్జునులను జూచిన భయమును, అసూయ యును కూడ ఎక్కువే. ఆ భయాసూయలే పెద్దవారైన తరువాత మఱియు నెక్కువైనవి. ఆ కారణమున కలిసియున్న కష్టముగా నున్నదని, ధృతరాష్ట్రుడు రాజ్యమును రెండుగా భాగించి, ఒక భాగమునకు ధర్మరాజును, రెండవభాగమునకు దుర్యోధనుని రాజులుగా చేసెను. పాండవులు తమ ధర్మము చేతను, బాహుబల శౌర్యపరాక్రమములచేతను రాజ్యమును బహు విస్తారము చేసికొని ధర్మముగా పరిపాలించుచు ప్రజల మన్ననలకు పాత్రులైరి. దేశములోని చాలమంది రాజులు పాండవులకు సామంతరాజులైరి. వారికీర్తి ప్రతిష్ఠలు మిక్కుటముగా పెరిగిపోవుచుండెను. వారి రాజ్యము, బలము, కీర్తి ప్రతిష్ఠలు పెరుగుచున్న కొలదిని వానితోపాటు పందెము వైచికొని దుర్యోధనుని హృదయములో అసూయాద్వేష ములు కూడ పెరుగుచుండెను. చివఱకు అసూయ పట్టలేక ఏ విధముననైన పాండవుల రాజ్యము అపహరింప వలయునని

క్షత్రియులు పన్నుచుండెను. బాహుబలముచేత జయించి రాజ్యమును తీసికొనలేడు.

శకునిమున్నగువారిసహాయ్యమునమాయోపాయములు అనేకములు పన్నినాడు. ఇంటికి నిప్పుపెట్టినాడు. భీమునికి విషము పెట్టించినాడు. చివఱకు జూదమునకు పిలిచి, మాయ జూదములో సర్వమును అపహరించి, పాండవుల భార్యయైన ద్రౌపదిని నిండు సభలో అవమానము చేయుటకు ప్రయత్నించినాడు. భీష్మాదులు మందలించుటచేత మఱల ధృతరాష్ట్రుడు పాండవుల రాజ్యము పాండవులకిచ్చి పంపించినాడు. అయిననేమి? పుత్రమోహము మిక్కుటమౌటచే దుర్యోధనుడు, వచ్చి ఏమేమో చెప్పికొని, దుఃఖించుటతో మఱలపాండవులను జూదమునకు పిలిపించినాడు ధృతరాష్ట్రుడు. పెద్దలెందఱో జూదము పనికిరాదని ధృతరాష్ట్రునికిని దుర్యోధనునికిని గట్టిగా చెప్పినారు. కాని వినలేదు. పెదతండ్రిమాట తీసివేయలేక జూదమునకు దిగినాడు ధర్మరాజు. ఆ ద్యూత నియమము లేవియన, ఓడినవారు తమ రాజ్యమును, ధనమును సర్వమును గెలిచినవారికిచ్చివైచి కట్టుగుడ్డలతో అరణ్యమునకు పోవలయును. పండ్రెండు సంవత్సరములు అరణ్యవాసమును, ఒక సంవత్సరము అజ్ఞాతవాసమును మొత్తము పదమూడుసంవత్సరములు సక్రమముగా గడిపి వచ్చిన తరువాత ఎవరిరాజ్యము వారు తీసికొనవలెను. అజ్ఞాతవాసములో శత్రువులకు తెలియకుండ నుండవలయును. వీరు తెలిసికొనుటకు ప్రయత్నింతురు. అట్లు శత్రువులు తెలిసికొన్న యెడల మఱల అరణ్యవాసము,

అజ్ఞాతవాసము చేయవలయును. ఇది నియమము. పాండవులు జూదములో ఓడిపోయిరి. పరమాత్మ అనుగ్రహమున ఈ పదమూఁడు సంవత్సరములను సక్రమముగా నెఱవేర్చివచ్చి, 'మా రాజ్యము మాకిమ్మ'ని అడిగినారు. 'సూదిమొనమోపు భూమినైన ఈయన'ని దుర్యోధనుఁడనినాఁడు. అనేకమంది పెద్దలు చెప్పినారు. చివఱకు కృష్ణపరమాత్మకూడ రాయబారిగా వెళ్ళి చెప్పినాఁడు. ఎవరేమేమి చెప్పినను దుర్యోధనుఁడు చెవిని పెట్టలేదు. చివఱకు యుద్ధమే నిర్ణయమైనది.

ప్రపంచములోని రాజులందఱును ఉభయపక్షముల చేరినారు. దుర్యోధనునిది పదునొకండు అక్షౌహిణులసైన్యము. పాండవులది ఏడక్షౌహిణుల సైన్యము.

దుర్యోధనుని సైన్యముపై ఆధిపత్యము భీష్మునిది. పాండవులసైన్యమున కాధిపత్యము ధృష్టద్యుమ్నునిది. ఉభయులు తమ తమ సైన్యములను తీసికొని ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునకు చేరినారు. యుద్ధసమాచారము లన్నియును ఎప్పటి కప్పుడు ధృతరాష్ట్రునికి తెలియ చెప్పుటకై వ్యాస భగవానుని అనుగ్రహమున దివ్యదృష్టినిఁపొందిన సంజయుఁడు నియోగింపఁబడినాఁడు. యుద్ధము పదిరోజులు జరిగినది. యుద్ధప్రారంభ దివసముననే అర్జునునకు కృష్ణపరమాత్మ గీతను ఉపదేశము చేసినాఁడు. కాని ధృతరాష్ట్రునకు ఆగీత ఎప్పుడు చెప్పుటయా ? అని సమయమునకు ఎదురుచూచుచున్నాఁడు సంజయుఁడు. సంజయునకు వ్యాసభగవానులు దివ్యదృష్టి

నిచ్చుటలో ఈ అభిప్రాయము ప్రధానముగ నున్నది. గీత, లోకోత్తరమైన గ్రంథము. దాని ప్రచారముచే లోక కల్యాణము చేకూఱగలదు. అది బయటకు రావలయును. ఎక్కడనో రణరంగమున ఏకాంతముగా కృష్ణపరమాత్మకును అర్జునునకును జరుగబోవు సంవాదరూపమైనది గీత. మిగిలిన రాజులు, సైన్యములలోని వ్యక్తులు వారివారి గందరగోళములో వారుందురు. కనుక ఆ గీత సంజయుని ముఖతః బయటికి తెప్పించుట వ్యాసభగవానుల అభిప్రాయము. సంజయునికి వ్యాసులవారు దివ్యదృష్టినిచ్చి "చాటునగాని బహిరంగముగ గాని జరుగుపనులు, మాటలాడు మాటలు, అంతరంగములోని అభిప్రాయములు సర్వము నీకు నీ కూర్చున్నచోటనే తెలియ గలవు" అని అనుగ్రహించుటచే వెంటనే వ్యాసభగవానుల అభిప్రాయముకూడ తెలిసిపోయినది. దానికి సమయము ఎప్పుడా అని వేచియున్నాఁడు సంజయుఁడు. సరే. పదిరోజులు యుద్ధము జరిగినది. సంగతులు సంక్షిప్తముగా చెప్పుచు, భీష్ముని పతనముకూడ చెప్పినాఁడు. భీష్ముని పతనము వినునప్పటికి ధృతరాష్ట్రునికి భరించలేని విచారము కలిగినది. మూర్ఛపోయినాఁడు. మూర్ఛ తేరిన తదుపరి "ఏమి ? ఏమి జరిగినది ? ఎవరు ఎవరు ఏమి ఏమి చేసిరి ?" అని ప్రశ్న వేసి నాఁడు. ఆ ప్రశ్నయే ఇప్పుడు ప్రచారములో ఉన్నగీతకు ప్రథమశ్లోకముగా ఎన్నబడు చున్నది. అసలు భగవద్గీత రెండవ అధ్యాయములోని పదునొకండవ శ్లోకము వద్దనుండి, పదునెనిమిదవ అధ్యాయములోని అఱువది ఆఱవశ్లోకమువఱకే.

మొదటి అధ్యాయములోని నలుబది ఏడు శ్లోకములును, రెండవ అధ్యాయములోని మొదటి పదిశ్లోకములును కలసి ఏబదియేడు శ్లోకములును గీతకు పూర్వపీఠిక. పదునెనిమిదవ అధ్యాయములోని చివరి పన్నెండు శ్లోకములును ఉత్తరపీఠిక.

కురుక్షేత్రమును గురించి మహాభారతములో చెప్పఁబడి యున్నది. ఆ క్షేత్రము సరస్వతీనదికి, దక్షిణమున దృషద్వతీనదికి ఉత్తరమున అనగా ఆ రెండునదుల మధ్యభాగమున ఉన్నది. దాని పొడవు నలుబదిమైళ్లు, వెడల్పు నలుబదిమైళ్లు. ఢిల్లీకి ఉత్తరముగానున్నది. మేము బదరీయాత్రా సమయములో కురుక్షేత్రముకూడ సేవించుకొను భాగ్యము కలిగినది. ఈ కురుక్షేత్రమునకే 'శ్యమంత పంచకము' అనికూడ పేరుకలదు. ఇక్కడ అగ్నిదేవుఁడు, ఇంద్రుఁడు, బ్రహ్మమొదలగు దేవతలు తపస్సుచేసినట్లు శాస్త్రములందు కలదు. కౌరవ వంశమునకు మూలపురుషుఁడైన కురురాజు ఇక్కడ బహుకాలము తపస్సు చేయుటచేతను, ఈ భూమిని దున్ని అనేక యజ్ఞములు చేయుటచేతను ఆయనపేరు మీఁద ఈ భూమికి 'కురుక్షేత్రము' అను నామము కలిగినది. ఈ క్షేత్రములో మరణించిన వారికి ఉత్తమగతులు కలుగునని బ్రహ్మాది దేవతలచే ఈయఁబడిన వరములుండుటచేతను, ఇంకను అనేక కారణములచేతను ఈ కురుక్షేత్రమునకు 'ధర్మక్షేత్రమనియు, పుణ్యక్షేత్రమ'నియు ప్రసిద్ధికలిగెను. ఇది పుణ్యక్షేత్రమగుట చేతను, ఇక్కడ మరణించినవారికి ఉత్తమగతులు కలుగునని వరములుండుట చేతను పూర్వపు రాజులలో యుద్ధములు కలిగినపుడు ఇక్కడకు

వాఁడు కాఁడు. మహావీరుఁడు. శౌర్యబలపరాక్రమములయందు అసమానుఁడు. ఎప్పుడును శత్రువులను జయించెడివాఁడు. కనుక ఇతని పేరుతో 'సమితిం జయః' అను విశేషణము చేర్చ బడినది.

5. అశ్వత్థామ:—ఈయన ద్రోణాచార్యుని కుమారుఁడు. పైన చెప్పిన కృపాచార్యుని మేనల్లుఁడు. శస్త్రాస్త్ర విద్యలలో బహునిపుణుఁడు. యుద్ధకళలో కూడ అపారమైన ప్రజ్ఞ కలవాఁడు. గొప్పశూరుఁడు. మహారథుఁడు. ఈయన తన తండ్రియైన ద్రోణాచార్యుని వద్దనే విద్యనభ్యసించెను. ఈయనకూడ ఈ యుద్ధము చివఱకు జీవించినవారిలో ఒకఁడు. ఇంత ప్రజ్ఞా విశేషములుకలవాఁడై కూడ చివఱకు, ఉపపాండవులు మొదలగు వీరులను నిద్రాసమయములో దొంగవలెపోయి ఘోరముగా అన్యాయముగా సంహరించినాఁడు.

6. వికర్ణుఁడు:—ధృతరాష్ట్రుని నూరుమంది కుమారులలో ఇతఁడు ఒకఁడు. ఇతఁడు మహావీరుఁడు, ధర్మాత్ముఁడు, మహారథుఁడు. కౌరవసభలో ద్రౌపదిని అవమానించు సమయములో-దుర్యోధనుని భయముతో ఎవరును ఏమియు అనలేక మిన్నకున్నను- ఒక్క యీ వికర్ణుఁడే ధైర్యసాహసములతో ఆ అన్యాయమును తీవ్రముగా ఖండించినది. చివఱకు ఎవరును వినకుండుటచే సభను దూషించుచు వెడలి పోయినాఁడు.

7. సౌమదత్తి:—ఈయనయే భూరిశ్రవుఁడు. సోమ దత్తుని కుమారుఁడగుటచే సౌమదత్తియని అందురు. ఈయన

భీష్ముని పినతండ్రియైన బాహ్లికునికి మనుమఁడు. ఈయనకూడ గొప్ప ధర్మాత్ముఁడు. యుద్ధకళయందు మంచినైపుణ్యము కలవాఁడు. శూరుఁడు, వీరుఁడు, మహారథుఁడు. గొప్ప గొప్ప దక్షిణలు ఇచ్చి, అనేకములైన యజ్ఞములు చేసినాఁడు. ఈ యుద్ధములోనే సాత్యకి చేతిలో మరణించినాఁడు. శ్లోకము చివఱ 'తథైవచ' అనుటచేత అశ్వత్థామ, వికర్ణుఁడు, భూరిశ్రవుఁడు కూడ కృపాచార్యుని వలెనే యుద్ధమునందు ఎవరిచేతను జయింపబడని వీరులు, శూరులు అని భావము.

తొమ్మిదవ శ్లోకములో- 'ఇంక చాలమంది శూరులు కలరు. అందఱును నా కొఱకై ప్రాణములు కూడ త్యజించుటకు సిద్ధముగ నున్నారు.' అని ఇక్కడ "త్యక్తజీవితాః" అనినప్పుడు 'నా కొఱకై ప్రాణములు వదలుటకు కూడ సిద్ధముగ ఉన్నవారు' అని భావార్థము. కాని కేవలము మూలమును చూచిన, త్యక్త=త్యజింపబడిన, జీవితాః=జీవితముకలవారు. అనగా, పోయిన ప్రాణములు కలవారు అని. అనగా చచ్చిన వారు అని అర్థము. ఏడవశ్లోకములో యీ సందర్భమును గుఱించి వ్రాయఁబడినది. కాన అక్కడ చూడవలసినది. నేఁడు చచ్చిననేమి ? రేపు చచ్చిననేమి? చచ్చినవారి క్రిందనే జమవేసినాఁడు దుర్యోధనుఁడు. కనుక వీరెంతశూరులైననేమి ? ఎంత వీరులైననేమి ? జయము మాత్రము సందేహమే. ఇదివరకు భీష్ముఁడు చెప్పినవన్నియును ఇప్పుడు జ్ఞాపకమునకు వచ్చుచున్నవి. పాండవులు అందఱును అతిరథులు, మహారథులనునది వేరు. యుద్ధము చేయుటకు ఏర్పడిన కారణ

మాలోచించిన- దెబ్బతినిన శార్దూలములవలె, ఆకలిగొన్న సింహములవలె వచ్చుచున్నారు. భీష్ముఁడనుచున్నాఁడు:-

సీ॥ వారఁదలుచు ధర్మ । వైభవంబున, దపస్సంపద
నెక్కుడు జనులకెల్ల
ధనువు నాఱింగంబు లను । బరిణతులు దా
కోర్తురు పరులకు నోర్వరాఁ
కోల్తల గలరు పై । క్కులు పరాక్రమములు
వేర్వేఱచేసిన । వీరులొక్క
మొగమయి తాకిన । వెగడందకుండు నే
మనసేన మున్నవమానపాటు ।

ఆ॥ దుఃఖపాటు గలిగి తోడరంగ వచ్చిన
వారుగాన యలతిబోవు ప్రాణ
మాసపడక యోపినంతయు బెనగుచు
రదిసహించి నిలుచు టరిది మనకు.

అని.

ఇన్నియు తలంపునకు ఒక్కసారి వచ్చుచున్నవి. 'భయమున్న సంధికి ఒడంబడకుండునా ?' అనుట అంత బాగుండలేదు. చివఱకు భయపడియేగదా! కొలనులో దాగుకున్నది ? అప్పుడైనను మరల ధర్మరాజాదుల పలుకులు వినిగదా రోషము పుట్టి భీమునితో గదా యుద్ధమునకు తలపడి చచ్చినది! ఏమి ? నీటిలోనుంచి రాకున్న ఎవరేమి చేయుదురు ? దాగిఁనిన వారిని లాగి బలవంతమున- యుద్ధము చేయనన్న- చంపరు గదా! ధర్మరాజునకు తెలియును-ఎంత రాజ్యకాంక్షయున్నదో,

ఎంతపిరికితనమున్నదో, అంతకన్న మిగిలి దురభిమా
రోషముకూడ గలదు. ఆకారణముననే అతనికి రోషము
నట్లు మాటలాడినది. అట్లుమాట్లాడిన అతను రోష
బయటకువచ్చునని తెలిసియే. అంతియకాని కొందఱు "ద
ధనుఁడు బయటికి రాకపోయినను లాగియైనను చంపుద
అని అందురు. పాండవులంత అధర్మయుద్ధముచేయువారు
కాని ధర్మరాజునకు దుర్యోధనునిమీద అభిమానముపో
ఆ అభిమానము అనేకఘట్టములలో చూపినాఁడు. సందర
వచ్చినప్పుడు చెప్పబడును. ధర్మరాజు ఆఅభిమానము చ
టయే దుర్యోధనునికి దురభిమానముపెరిగి ఇంకను వారి
ద్వేషముపెరుగుటకు కారణమైనది. ఆఅభిమానమే ఇ
కూడ "మనము క్షత్రియులము. మొదటేయుద్ధమునకు
టయో, రాకపోవుటయో నిర్ణయించుకొనవలయును
వచ్చినతరువాత జయించిన జయించవలయును లేకున్న
వలయునుగాని క్షత్రియుడు రణరంగమునుండి పారి
బ్రతుకుటకంటె ఇకమించిననీచములేదు." అనిచెప్పినది. ద
ధనుఁడు న్యాయమోఅన్యాయమో యుద్ధమునకుదిగిన
మధ్యలోనైనను అశ్వద్ధామ మొదలగువారు "ఇకవ
జయించలేము. ఇప్పటికైనను సంధికొడంబడుము.
రాజాదుల నెట్లయినను మేముఒప్పించెదము". అనిబోధించి
అప్పుడుకూడ దురభిమానమే అడ్డమువచ్చినది. "సంధిచేసి
మొదటనే చేసికొనవలయును గాని ఇంతదూరముజరిగి,
మంది ప్రధానమైనవారు అందఱుచచ్చినతరువాత స

కొనుటవిమి? సంధికొడంబడను." అని దుర్యోధనుఁడు గట్టిగా చెప్పినాఁడు. అదిఇప్పుడేమైనది. తనదాకవచ్చునప్పటికి, ఇక చావుకిజంకియేకదా! పారిపోయినీళ్లలోదాగినది. అది ధర్మ రాజునకు ఇష్టములేదు. 'ఈరాజ్యమంతయు నీవేతీసికొనుము. అందఱుచచ్చిరిగదా! ఈ శ్మశానమును నీవేపరిపాలించు'. అని కూడ నీటిలోనుంచి పైకిరాకుండ సమాధానముచెప్పినాఁడు. ఇంక అతనిని బయటికిపిలిచిమరీచంపుటకు కారణమేమి? ధర్మ రాజుఅభిప్రాయముఇది. దుర్యోధనుఁడు సుక్షత్రియకులమున ఉద్భవించినాఁడు. న్యాయమోఅన్యాయమో రారాజుగాఅనేక భోగములు అనుభవించినాఁడు.భూమి నేలినాఁడు.ఇప్పుడుచివరికి అతనికిముఖ్యమైనవారందఱునుచచ్చిరి. చెట్టుకొమ్మలన్నియును కొట్టివేయగా, మొదలుమాత్రము మొండెముగాదిగబడినట్లు దిగబడినాఁడు. ఇప్పుడురాజ్యముమనకిచ్చి తండ్రి తల్లిమొగము చూడగలడా?ఇప్పటికి వీడొక్కడైనను బ్రతికి బయటపడినాఁడు అని తల్లిదండ్రులు సంతోషింతురా! అదీలేదు.పోనీమనదగ్గఱకు వచ్చి ఏదోకులాసాగా జీవితముగడుపుకొనునా? అంటే దురభి మానముచేత అదిచేయడు. పోనీ ఈలోకములో కీర్తి యుండునా! అంటే అందఱునుయుద్ధములో చచ్చువఱకు 'యుద్ధము,యుద్ధమ'ని తనచావుదగ్గఱకు వచ్చునప్పటికి పారి పోయినపిరికిపంద, దుర్మార్గుఁడు, అనిలోకము నిందించుతుంది. ఈచీకుతో బాధపడి, బాధపడి చచ్చిపోకమానడు. అటువీర స్వర్గమాలేదు. ఈచేసినపాపములకు నరకబాధలు తప్పవు. కాబట్టి ఇవన్నియుతప్పించి వీరస్వర్గమైన దొరుకున' ను అభి

మానముతో ఎట్లైనను రోషముపుట్టి బయటకువచ్చునట్లుచేసి యుద్ధముచేయించి, ఆయుద్ధములోచంపినాఁడు. యధార్థమాలోచించిన ఇప్పుడు దుర్యోధనుని చంపకపోయినను ఇక ధర్మరాజునకు నష్టమేమియునులేదు. అయినను ఈచేసినది దుర్యోధనునిమీఁదనున్న అభిమానమే. "చివఱికి క్షత్రియోచితమైన చావైననుచచ్చును," అనుభావముతో మడుగులోనున్న వానిని పిలిచి మరీచంపించినాఁడు. గదాయుద్ధములో భీముని చేతిలోమరణించినాఁడు. వీరస్వర్గమలంకరించినాఁడు. కేవలము చివఱియుద్ధము దుర్యోధనుని వీరస్వర్గముకొఱకై మాత్రమే ధర్మరాజు ఏర్పాటుచేసినట్లు కాన్పించును. మధ్యలోప్రసంగాంతరముగావచ్చినది. అసలు విషయమేమన పాండవులతోయుద్ధమన్నను, చావన్నను దుర్యోధనునికి భయములేకపోలేదు. 'జరుగదు' అనుకున్నాఁడు. వచ్చిమీఁదపడినది. భయమును మించిన దురభిమానము, దురభిమానమునుమించిన భయము, రెండూ హృదయములో పెనుగులాడుచునేయున్నవి. దేనికి బలముగలిగినప్పుడు అదిక్రియారూపములో బయటపడుచూ వచ్చినది. అంతియే. సంధికి ఒడంబడని యంతమాత్రమున భయములేదని అనుకొనవద్దు. ఈభయముననే ద్రోణాచార్యులతో ఈరెండుసేనలలోని వీరులనుచెప్పి "మనసేనకంటె పాండవసేన శక్తివంతముగానున్నది" అనిచెప్పుచున్నాడు.

శ్లో. అపర్యాప్తం తదస్మాకం
బలం భీష్మాభిరక్షితం

పర్యాప్తం త్విదమేతేషాం
బలంభీమాభిరక్షితం. 10

ప. ఛా. అపర్యాప్తం, తత్, అస్మాకం, బలం,
భీష్మాభిరక్షితం, పర్యాప్తం, తు, ఇదం, ఏతేషాం,
బలం, భీమాభిరక్షితం.

టీక :—

తత్ = ఆకనపడు,
అస్మాకం = నాయొక్క,
భీష్మాభిరక్షితం = భీష్మునిచేరక్షింపబడుచున్న,
బలం = సైన్యము,
అపర్యాప్తం = (శత్రుసైన్యమునుజయించుటకు) చాలదు.

ఇదం = ఈ
ఏతేషాం = వీరియొక్క (పాండవులయొక్క)
భీమాభిరక్షితం = భీమునిచేరక్షింపబడుచున్న
బలం = సైన్యము,
పర్యాప్తం = (మనలను జయించుటకు) చాలినది.

తా. భీష్మునిచేత రక్షింపబడుచున్న ఈ మనసేన పాండవసేనను జయించ అసమర్థమైనదిగానున్నది. భీమునిచేత రక్షింపబడుచున్న ఆసేన మనలను జయించ సమర్థమైయున్నది.

అమృతవాహిని :—

ఈశ్లోకమునకు కొంతమంది ఒకవిధముగాను, మఱి కొంతమంది ఇంకొకవిధముగాను అర్థమువ్రాయుచున్నారు.

అపర్యాప్తం' అనగా 'అసమర్థమైనది' అనియును, 'పర్యాప్తం' అనగా 'సమర్థమైనది' అనియును కొంతమంది వ్రాయుచున్నారు. 'అపర్యాప్తం' అనగా సమర్థమైనది' అనియును 'పర్యాప్తం' అనగా 'అసమర్థమైనది' యనియును కొంతమంది వ్రాయుచున్నారు. ఈరెంటిలో ఏదిసమంజసము? అనిప్రశ్న. దీనికి సమాధానము చెప్పటము చాలకష్టమే. సాధ్యమైనంత వరకు అభిమానరహితముగ పరమాత్మయిచ్చిన బుద్ధిబలమును దుర్వినియోగము చేసికొనకుండ విచారించుటకై ప్రయత్నించెదను. అభిమానము వదలిపెట్టుటచాలకష్టమైన విషయమే. అభిమానమునకును పూర్వజన్మ సంస్కారములకును బలమైన సంబంధమున్నది. భారతయుద్ధకాలమునాటికి ఎవరైననుఉండి దుర్యోధనునియందు అభిమానముగా, ఆయనయందిష్టముగా నున్నచో, ఆ అభిమానము ఇప్పటికినివదలిపెట్టదు. తనభాషా ప్రావీణ్యము, శాస్త్రపరిచయము, లోకజ్ఞానము మొదలగు సామర్థ్యములన్నియును, దుర్యోధనుని సమర్థించుటలోనే ఉపయోగించబడుతవి. అట్లే పాండవులతో అప్పటిసంబంధమున్న వారున్నచో వారికినిఅంతే. వారు తమశక్తిసామర్థ్యములన్నియును వినియోగించి పాండవులను సమర్థించ ప్రయత్నించుదురు. కాని సత్యము వీరివీరిసమర్థనములమీద ఆధారపడియుండదు. అయితే ఎవరివాదము సత్యమును అందుకోగలుగుతుందో, అది సత్యమును అందుకొనుటచేత యథార్థము. అంతేగాని సమర్థించుకోగలుగుటచేత కాదు. 'ఇద్దఱును సందులేకుండ సమర్థించుకొనగలుగుచున్నారే.' అంతేనిజమే. ఇక

అది ఎలా తేలవలయునన్నచో అప్పుడు దుర్యోధనుని భావమును గ్రహించగలిగిన వారెవరైనను ఉన్నయెడల మనకు వారుచెప్పినది ప్రధానము. ఆఅవకాశము మనకుచిక్కిన యెడల అప్పుడు దుర్యోధనుని వాగ్జాలమునకుబలమేఉండదు. ఎందులకన ? కుటిలరాజనీతికలవాడు సాధ్యమైనంతవఱకు తన మనోభావములను వెలికి తోచనీయక మాటలాడుచుండును. భయమున్నప్పుడు సందర్భమునుబట్టి, భయములేనివానివలె, అతిధైర్యసంపన్నునివలె, ముఖాది అవయవములలో భావమును గుర్తించుటకు ఎంతమాత్రమునువీలులేకుండమాటలాడ గలఁడు. భయములేకపోయినను అవసరమునుబట్టి అతిభయపడువానివలె గోచరించును. కనుక వానిపై మాటలు మనకు ప్రమాణములుకావు. ఇకదుర్యోధనాదుల భావములు ఉన్నవి ఉన్నట్లు కనిపెట్టగలిగినవారున్నారా? ఉన్నచో ఎవరు? అని అడుగవచ్చును. ఆ! ఉన్నారు. అని ధైర్యముగా చెప్పగలము. అందఱికిని తెలియును. వ్యాసులు, వ్యాసానుగ్రహముచే దివ్యదృష్టిని ప్రసాదించబడినసంజయుఁడు. చాలు వీరిద్దరినితీసికొనిన చాలు. వీరుపక్షపాత రహితులు. ఉన్నదున్నట్లు భయములేక చెప్పగలధీరులు. ఆదివ్యదృష్టి తనవద్దస్థిరముగా నిలుపుకోగల సద్గుణములన్నియునుకలవాఁడు సంజయుఁడు. సంజయునికి దివ్యదృష్టిఅనుగ్రహించగల సామర్థ్యమున్న వ్యాసుని విషయము చెప్పవలయునా? వారిద్దఱును ఎక్కడైనను దుర్యోధనునికి ఈసందర్భములో భయమున్నట్లుచెప్పినారా? చూడవలసియున్నది. అదిమనకు దొరకనప్పుడు ఎవరికి ఏదిఇష్టమో

అట్లువ్రాసికొనవచ్చును. అంత బాధాకర మైన విషయముకాదు. కాని ప్రతివిషయమును జాగ్రత్తగాపరిశీలించుటయనునది మానవునకు ఉండవలసినమంచి లక్షణములలోఒకటి. అవసరము వచ్చినదికనుక విచారించుటయేకాని దుర్యోధనునికిభయమున్నను, లేకపోయినను గీతాప్రబోధమువలన కలుగవలసిన ఫలమునకుగాని, గీతలోనిపరమార్థతత్త్వమును గ్రహించుటకుగాని ఎంతమాత్రమును ప్రతిబంధకములేదు. అయినను విచారించుదము.

దుర్యోధనుని అభిప్రాయము 'తనసేనయే అజేయముగానున్నద'నువారు. ఆనందగిరి–'పదకొండు అక్షౌహిణీలుగల మన బలముఅపరిమితము. ప్రసిద్ధమైన మహిమగలవాఁడును,సూక్ష్మబుద్ధియునైన భీష్మునిచేత అన్నివిధములను రక్షింపఁబడుచున్నది. కాన, పర్యాప్తము అనగా శత్రుసైన్యమును పరిభవించుటకు సమర్థమైనది. ఈపడు అక్షౌహిణుల అల్పసంఖ్యగల పాండవసేన, చపలబుద్ధియు, సామర్థ్యహీనుఁడునునైన భీముని చేత రక్షింపఁబడుచున్నది. కనుక, మనలను 'అవమానపఱచుటకు అపర్యాప్తమైనది. అనగా అసమర్థమైనది' అని వ్రాసియున్నారు.

వీరుశ్లోకముయొక్క అర్థముతీయుటలో పదములను తాఱుమాఱుచేసియున్నారు. ఎందులకన 'పర్యాప్తం' అనగా 'సమర్థమైనది' అనే అర్థమే వీరికి సమంజసమైనది. కాని, దుర్యోధనుని సైన్యము అసమర్థమైనది అనిఒప్పుకొనుటకు మాత్రము మనస్కరించలేదు. ఆకారణముచే 'పర్యాప్తం' అన్నపదమును

తీసికొనివచ్చి, భీష్మునిచే రక్షింపఁబడుచున్న సేనకును 'అపర్యాప్తం' అన్నపదమును తీసికొనివచ్చి, భీమునిచే రక్షింపఁబడుచున్న సేనకును అంటించినారు. ఇక్కడ మేమాలోచించునది 'అపర్యాప్త, పర్యాప్త' శబ్దములకు వీరేమి అర్థముతీసినారు అనిమాత్రమే. 'పర్యాప్త' శబ్దమునకు 'సమర్థమైనది' అని అర్థము వీరుఒప్పుకున్నచో, ఇఁక ఆపదములు దానిదిదీనికి, దీనిదిదానికి అంటించి విరసముగా అర్థముతీయుటకన్న సరసముగా అర్థముతీయుట సరసులుమెత్తురుగదా! ఇంక ఈ పక్షమువారు దుర్యోధనుఁడు భయపడినట్లు భారతములో ఎక్కడఉన్నది? అని అడుగుదురు. 'భీముఁడు చపలబుద్ధి, సామర్థ్యము లేనివాఁడు' అని భారతములో ఎక్కడనైన వీరికి కనుపడినదికాబోలు.

ఈ ఆనందగిరులే 'అథవా—లేకపోతే'అని ఇంకొక అర్థముచెప్పినారు.

'తదిదమస్మాకం బలం భీష్మాధిష్ఠితమపర్యాప్తం అపరిమితం అధృష్యమక్షోభ్యం ఏ తేషాంతు పాండవానాం బలం భీమేనాభిరక్షితం పర్యాప్తం పరిమితం సోఢుం శక్యమిత్యర్థః' అనగా–ఇందునను భావము ఒకటే. దుర్యోధనుఁడు తనబలమును మెచ్చుకొనుచున్నట్లే వ్రాసినారు. కానిపర్యాప్త, అపర్యాప్త శబ్దములకు అర్థములుమార్చినారు. ఇందులోమాత్రము 'అపర్యాప్తం' అనగా సమర్థమైనదిఅనియును, 'పర్యాప్తం' అనగా అసమర్థమైనది అనియును వ్రాసినారు. స్వతంత్రులు–వారు ఎట్లువ్రాసినను బాధలేదు.

మధుసూదన సరస్వతీ స్వాములవారుకూడ ఇట్లే పదములను తారుమారుచేసి అర్థము వ్రాసియున్నారు. 'అపర్యాప్త' శబ్దమును పాండవులసైన్యమునకు తెచ్చి అంటించినారు. 'తత్పాండవానాం బలం అపర్యాప్తం' అన్నారు. 'పాండవులబలము అసమర్థము'-అని, 'పర్యాప్త' శబ్దమునకు 'సమర్థము' అనిఅర్థమువీరును ఒప్పుకొనినారు. కాని, పాండవుల సైన్యము సమర్థమైనది అనుటకు ఏలనో వీరిమనస్సు ఒప్పుకొనకున్నది. కనుక, మూలములో పాండవులసైన్యమునకు తగిలించిన 'పర్యాప్త' శబ్దమును వీరి వ్యాఖ్యానములో దుర్యోధనుని సైన్యమునకు తగిలించినారు. 'మహాభారతములో ఆదిపర్వతము' అన్నారుఒకరు. తెలివిగలిగి సర్దుకుపోయ్యే వారు మా 'త' ఎక్కడోఅక్కడ వచ్చిందిలే' అని తృప్తిపడినారట. అట్లే 'పర్యాప్త' శబ్దమును వీరుఎక్కడకు తీసికొనిపోయిపెట్టినను మా అర్థముమాత్రము ఒప్పుకొనినారు. మాకు చాలును. వీరికికూడ భీమునిమీాద అసూయయే. "భీమోఽతిదుర్బలహృదయః రక్షితః" అన్నారు. భీముఁడు అతిదుర్బలహృదయుఁడు అన్నారు. భీమునిమీాదఎందుకింత అసూయయో? తెలియకున్నది. శంకరానందులవారు ఇంకను తికమకలుపెట్టినారు. 'భాష్యోత్కర్షదీపిక' అనువ్యాఖ్యానములోకూడ ఇట్లే మార్చినారు. కాని 'పర్యాప్త' శబ్దమునకు 'సమర్థమ'ను అర్థమే అంగీకరించిగ్రహించినారు.

'పాండవులబలమే సమర్థమైనది' అని దుర్యోధనుని అభిప్రాయముగా సమర్థించినవారు - శంకర భాష్యమునకు

వ్యాఖ్యానముచేసినవారిలో ఆధునికులు బెల్లంకొండ రామా రావుగారు తమభాష్యార్కప్రకాశికలో "భీష్మాభిరక్షిత మ స్మాకంబలమపర్యాప్తమసమగ్రం పరబల విజయాక్షమ మిత్యర్థః భీష్మస్యవృద్ధత్వాదితి భావః. ఇదంచ భీష్మసామర్థ్యా పరిజ్ఞాన మూలకం వాక్యం, భీష్మస్య ధర్మిష్ఠత్వేన పాండవ పక్షపాతిత్వాదితివాభావః, ఇదంద్దృశ్యమానం భీమాభిరక్షితమే-తేషాం పాండవానాంబలం తుపర్యాప్తంభీమస్యతరుణత్వాత్, సర్వ ధార్తరాష్ట్రవధ దీక్షితత్వాత్. ఆబాల్యాత్సహోదరస్య దుర్యోధనస్య భీమేనబహుళో నిర్జితత్వాచ్చ, భయహేతుర్భీమో దుర్యోధనస్యేతి భావః" అని అన్నారు. అనగా సారాంశము :—భీష్మునిచేత రక్షింపఁబడుచున్న మనసైన్యము శత్రు సైన్యమును జయించుటకు అసమర్థమై యున్నది. ఎందువలన అనగా భీష్ముఁడు వృద్ధుఁడు గనుక. ఈవాక్యము దుర్యోధనునికి భీష్ముని సామర్థ్యము తెలియక పలుకబడినది. భీష్ముఁడు ధర్మనిష్ఠుఁడు, పాండవపక్షపాతియు నగుటచేతను కూడ. ఈకనపడు పాండవసేన, భీముని చేత రక్షింపఁబడు చున్నది. మనలను జయించుటకు సమర్థమైయున్నది. కారణ మేమన, భీముఁడు భీష్మునికంటె తరుణవయస్కుఁడు. అదియునుగాక, ధార్తరాష్ట్రుల నూఱుమందిని సంహరించుటకు దీక్షపూనియున్నాఁడు. బాల్యమునుండియునుకూడ అనేక సారులు సోదరులతోసహా దుర్యోధనుఁడు భీమునిచేత పరిభవింపఁబడినవాఁడు. ఈకారణములచేత దుర్యోధనునికి భీముని చూచిన అపరిమితభయము, అని పై వ్యాఖ్యానమునకుభావము.

శ్రీమద్రామానుజ భగవత్పాదులుకూడ, దుర్యోధనుఁడు భయపడి పలికిన పలుకుగానే నిర్ణయించినారు. "దుర్యోధనః స్వాయమేవ భీమాభిరక్షితం పాండవానాంబలం ఆత్మీయంచ భీష్మాభిరక్షితం బలం ఆలోక్యఆత్మవిజయే, తస్యబలస్యపర్యాప్తతాం, ఆత్మయస్యబలస్య తద్విజయే చాపర్యాప్తతాం ఆచార్యాయనివేద్య. అంతరేవిషణ్ణః అభవత్" అనివ్రాసినారు.

"దుర్యోధనుఁడు స్వాయముగ భీమునిచేత రక్షింపఁబడుచున్న పాండవులసేనను, భీష్మునిచేతరక్షింపబడుచున్న తన సేననుజూచి పాండవులసేన తమనుజయించుటకు సమర్థముగా నున్నదనియును, తనసేనవారిని జయించుటకు చాలదనియును ఆచార్యులకు నివేదించి, మనస్సులో ఖిన్నుఁడాయెను." అని పై వ్యాఖ్యానము యొక్క భావము. శ్రీధరులుకూడ ఇదే భావమునువ్రాసియున్నారు. "తత్ తథాభూతైః వీరైః యుక్తమపి, భీష్మేణాభిరక్షితమప్యస్మాకంబలం సైన్యమపర్యాప్తం, తైస్సహాయోద్ధుమసమర్థంభాతి, ఇదంతు ఏతేషాం పాండవానాం బలం భీమేనాభిరక్షితం పర్యాప్తం సమర్థంభాతి, భీష్మస్య ఉభయపక్షపాతిత్వాత్ అస్మద్బలం పాండవసైన్యం ప్రతి అసమర్థం భీమస్య ఏకపక్షపాతిత్వాత్ ఏతద్బలం అస్మద్బలం ప్రతిసమర్థంభాతి."

అనగా 'అటువంటి వీరులతో కూడినదైనను భీష్మునిచేత రక్షింపఁబడుటచేత మనసైన్యమువారితో యుద్ధముచేయ సామర్థ్యములేనిదిగ యున్నది. ఈ పాండవసైన్యమన్ననో భీమునిచేత రక్షింపఁబడుచున్నది. కాన, మనలజయించ

సామర్థ్యమును కలదిగనున్నది. భీష్ముఁడు ఉభయ పక్షపాతి యగుటవలన మనసైన్యము పాండవులసైన్యమును గెలుచుటకు చాలదు. భీముఁడు ఏకపక్షపాతియగుటవలన వారిసైన్యము మనలను జయించచాలియున్నది' అని పై వ్యాఖ్యానము యొక్క భావము. మహాభారతము తెనిగించిన కవిత్రయ ములో తిక్కనకవీంద్రుఁడుకూడ 'అపర్యాప్తం' అనగా అస మర్థము అనియును, 'పర్యాప్తం' అనగా 'సమర్థము' అని యును అర్థము వ్రాసియున్నాఁడు. ఈసందర్భమునే తెనిగిం చుచు "భీమాభిరక్షితంబగు నబ్బలంబుసాలసమర్థంబునుంబోలె మెఱసె" అనియును, "ఇట్లు బెరసి భీష్మపరిపాలితంబయిన యీసైన్యంబు పెద్దయుసమర్థంబైతోఁచుచున్నయది" అని యును తెనుగులోవ్రాసియున్నాఁడు. మహాభారతము నంతను తెనుఁగువచనకావ్యముగ రచించిన శ్రీమాన్ భ. తి. రాఘవాచార్యులుగారు "అట్టి పరాక్రమవంతులుగల మన సైన్యమును గంగాపుత్రుఁడగుభీష్మునిచేత అంతట రక్షింపఁ బడుచున్నదిగానుండినను సంపూర్ణముగాకయున్నది. కావున, పాండవులను జయింపజాలదని తోఁచుచున్నది. అలా పాండ వుల సైన్యమైతే భీమునిచేత అంతట రక్షింపఁబడుచున్నదై సంపూర్ణముగా నున్నది" అని వ్రాసియున్నారు. మహామహో పధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ ఇత్యాద్యనేక బిరు దాంకితులును, ఇప్పుడు ప్రభుత్వ సంస్థానకవిగా నున్నటు వంటెన్నీ, మహాభారత, రామాయణ, భాగవతగ్రంథములను పద్యకావ్యములుగా ఆంధ్రములో రచించినట్టియును ఇంకను

అనేక గ్రంథములు సుమారు 150 పైన వ్రాసినటువంటివిన్ని, శ్రీ శ్రీపాద కృష్ణకవీంద్రుఁడు తన మహాభారతములో,

"సీ..........................................

భీష్మరక్షితమయి వెలసిన మన బల,
గమ్ము చాలకయుండెఁగాదె తెలియ
భీమరక్షితమయి వెలసిన రిపుబల,
గము చాలియుండెనుగాన......" అనివ్రాసినారు.

ఇంతకును దుర్యోధనుని అభిప్రాయమేమి? "పాండవుల సైన్యమును జూచి భయపడియుండునా? అన్నది. నా అభిప్రాయమును నాలుగు, అయిదు, ఆఱు శ్లోకముల వ్యాఖ్యానములో చూడనగును. తరువాత పండితప్రకాండుల అభిప్రాయములు కూడ దొరికినంతవఱకు ఇచ్చియున్నాను. కనుక ఎంతపరిశీలించినను 'తనసైన్యము పాండవసైన్యమును జయించజాలదేమో' అన్న భావముతో దుర్యోధనుఁడు చెప్పినాఁడన్నదే సమంజసముగా కనబడుచున్నది. అట్లుగాక భయములేదనుకున్నను అట్లుచెప్పుటలో పొరబాటులేదు. ఇంకను మేలేవీరులకు. మహారథులు, అతిరథులు అయినవారికి "మనలను శత్రువులు జయించినట్లు కనపడుచున్నదే"? అనునప్పటికి పౌరుషము, రోషము, శత్రువులయందు ద్వేషము పెల్లుబుకును. ఆ అభిప్రాయముతోనైనను చెప్పవచ్చును కాని, అర్థముమాత్రము ఇదే సమంజసము. ఇట్లుచెప్పి ఈకారణమున మీరందఱును అన్నివిధముల భీష్మునే కాపాడవలయు ననుచున్నాఁడు.

శ్లో. అయనేషుచ సర్వేషు
యథాభాగ మవస్థితాః

భీష్మమేవాభి రక్షంతు
భవంతస్సర్వ ఏవహి. 11

ప. ఛా. అయనేషు. చ. సర్వేషు. యథాభాగం.
అవస్థితాః. భీష్మం. ఏవ. అభిరక్షంతు. భవంతః.
సర్వే. ఏవ. హి.

టీక —

భవంతః = మీరు,
సర్వే + ఏవ = అందఱును,
సర్వేషు = అన్ని,
అయనేషు = సైన్యములయొక్క మార్గములయందును,
యథాభాగం = మీకు మీకు ఏర్పడిన యుద్ధస్థానముల యందు,

అవస్థితాః = ఉన్నవారలై.
భీష్మమేవ = భీష్మునినే,
అభిరక్షంతు = అన్నివైపులనుండియురక్షింపవలయును.
హి = ఇదేముఖ్యము అను అర్థమందు ఉపయోగింపబడి యున్నది.

తా. కనుక వ్యూహముగా పన్నబడిన సైన్యముయొక్క అన్నిప్రవేశ మార్గములయందును, జాగ్రత్తగ మీరందఱునుకలసి, నిలచియుండి అన్నివిధములను భీష్మునేరక్షింపవలయును.

## అమృతవాహిని :—

ఓఆచార్య ! కనుకమీరందఱును జాగ్రత్తగా భీష్మునే కాపాడవలసినది. ఎంత పాండవ పక్షపాతియైనను, పాండవులను

సంహరించనని దీక్షపట్టినాఁడుగాని, ఇతరసైన్యమును చంపనని ప్రతిజ్ఞ లేదు. రోజుకు పదివేలమంది సైన్యమును చంపుదునని నాకు వాగ్దానమిచ్చియున్నాఁడు. పాండవులు శిఖండిని ఎదురుగ పెట్టుకుని యుద్ధముచేయుదురు. శిఖండితో యుద్ధముచేయనని ప్రతినయున్నట్లు చెప్పియున్నాఁడు. మొదటిరోజుననే శిఖండిని అడ్డముపెట్టుకుని మహారథికోత్తముఁడు అర్జునుఁడు వచ్చిన యెడల ఒకవీరాధిపేరుని చేతులారపోగొట్టుకొన్నవార మగుదుము. కాన మీరందఱును అట్లుఎవరును ఏప్రక్కనుంచియు వచ్చికొట్టకుండ అన్నివైపులనుంచియును కాపాడవలయును. కాన, ఈవ్యూహమునకున్న అన్నిప్రవేశద్వారములయందును, గట్టిదిట్టమైన జెట్టులను నిలుపవలయును. మీరుబుద్ధులను, చిత్తములను ఏకాగ్రముచేసికొని భీష్మునే కాపాడవలయును. అజాగ్రత్తగాయున్న, ఒకనక్కకూడ సింహమునైనను చంపగలదు. అట్లేభీష్ముఁడు ఎంతపరాక్రమశాలియైనను, యుద్ధము చేయకున్న ఎవరైనను చంపగలరు. ఇంక పాండవులసేనలో అందఱును మహారథులే, యుద్ధవిశారదులే. అయినప్పుడు మనము ఎంతజాగ్రత్తగా భీష్మునికాపాడవలయును! అనిచెప్పి, భీష్ముని అన్నివిధముల అన్నివైపుల కాపాడవలసినది అని హెచ్చరించుచున్నాఁడు.

## భీష్ముఁడు శిఖండితో యుద్ధము చేయకపోవుటకు కారణము

శిఖండి ద్రుపదరాజు కుమారుఁడు. ధృష్టద్యుమ్నునికి అన్నగారు. పుట్టినప్పుడు స్త్రీగాపుట్టెను. అట్లు పుట్టుటకు హేతు

వేమన :—కాశీరాజు కుమార్తెలు అంబ, అంబిక, అంబాలిక యనుముగ్గురుకలరు. వారిలో పెద్దది అయిన 'అంబ' స్వయం వరములో సాళ్వరాజును వరించెను. తరువాత, కొన్ని దినములకు మిగిలిన ఇద్దఱి కుమార్తెలకును స్వయంవరము చాటించెను. ఆ స్వయంవర వేళను చిన్నకుమార్తెలఇద్దఱితో, అంబ కూడా అలంకరింపఁబడి ఆస్వయంవర వేదికపైనుండెను. ఆ స్వయంవరములో రాజుల నందఱిని గెలిచి భీష్ముఁడు తన తమ్మునికై ఆబాలికల బలవంతమున తీసికొని వచ్చెను. ఆ తీసికొని వచ్చుటలో అదివఱకే సాళ్వ రాజును 'అంబ' వరించుట తెలియక ముగ్గురను తీసికొని వచ్చెను. వచ్చినతర్వాత 'అంబ' తనవృత్తాంతముచెప్పి, సాళ్వ రాజునొద్దకు పంపమని ప్రార్థించెను. అదివిని భీష్ముఁడుకూడ గౌరవ మర్యాదలతో ఆమెను సాళ్వునివద్దకుపంపెను. కాని ఆయన "పరపురుషుఁడు పట్టితీసికొనివెళ్లిన నిన్నొల్లన"ని భీష్మునిమీాద కోపమున పలికెను. ఆమె మఱల భీష్ముని యొద్దకువచ్చి, "నన్ను సాళ్వుఁడు పరిగ్రహించలేదు. మీా తమ్మునికిచ్చి వివాహముచేయుఁడు" అని అడిగెను. భీష్ముఁడు "అదియెట్లుకూడును? మొదటనే తెలియకపోయిన ఏమి జరిగెడిదో? నీవుస్వయముగా 'సాళ్వునివరించితిన'ని చెప్పితివి. పరపురుషుని వరించినయామెను నాతమ్మునికి వివాహముచేయుటకు ఎట్లొప్పుకొందును? వాఁడైనను స్వీకరించునా?" అని చెప్పినాఁడు. "అయిన నాగతి నీవలననే ఇట్లు అయినది. కనుక నీవే వివాహముచేసికొమ్ము" అని అడిగినది. దానికి భీష్ముఁడు

కినిసి "ఓసీ ! ఇదినీకుతగదు పొమ్ము" అని పంపివేసెను. ఆమె భీష్మునిమీద పగసాధించదలంచి, అనేక ప్రయత్నములు చేసి, అన్నియును విఘ్నములుకాగా, చివఱకు శివునిగూర్చి తపస్సు చేసి, శివునిచే "నీవు మరుజన్మమున ద్రుపదరాజుకు కుమార్తెగా పుట్టి, తరువాత పురుషుఁడవై భీష్ముని చంపగలవు". అని వరము పొందినది. ఇక్కడ ద్రుపదరాజు పుత్రులులేక శివుని ఆరాధించి, భీష్మునిమీద చిరకాలముగా పగయుండుటచే, "భీష్ముని చంపగలపుత్రుఁడు కావలయున"ని వరమడిగెను. ఆయనయు "అట్లే ముందుపుత్రికగాపుట్టి, పురుషుఁడై, యుద్ధమున భీష్ముని చంపగలఁడు" అని వరమిచ్చి వెళ్లిపోయెను. అక్కడ 'అంబ' శివునివరముపొంది, వెంటనే ఎండుకట్టెల ప్రోగుచేసి, అగ్నిరగిల్చి, భీష్మునిమీదికోపమున "మరు జన్మమునభీష్మునిచంపగలుగుదును" అనుమహావాంఛతో. చితిలో పడి ప్రాణములు విడిచెను. తరువాత ఆచైతన్యము వచ్చి ద్రుపదుని భార్యాగర్భమున ప్రవేశించెను. ఆమెగర్భమును ధరించి సకాలమున ఒకపుత్రికను ప్రసవించెను. తల్లిదండ్రులు ఈ విషయమును బహురహస్యముగానుంచి, మగపిల్లవాఁడు కలిగినట్లు ప్రకటించి, మగపిల్లవానికిచేయవలసిన జాతకకర్మాది కృత్యములు నెఱవేర్చి "శిఖండి" అనునామకరణము చేసిరి. తరువాత అతిజాగ్రత్తగ, అతిప్రచ్ఛన్నముగా పెంచుచు, ఈ విషయమంతయును రహస్యముగా నుంచుటకు కారణమును ఆబాలికకుకూడచెప్పి జాగ్రత్తగ యుండుమనిరి. అక్షరాభ్యాసముచేసి, మరికొంతకాలమునకు ద్రోణాచార్యులవద్ద

శస్త్రాస్త్రపరిశ్రమ చేయించుచుండిరి. కొంతకాలమునకు ఆ బాలికకు యవ్వనమంకురించుచుండ, తల్లిదండ్రులు ఆమెను జూచి ఏమిచేయుటకు తోచక, శివుని వరముతలంచి ధైర్యము వహించి "ఎట్లులైనను బయటపడకమునుపే, వివాహము చేసినయెడల, తరువాత నేమగునో, శివునిఇచ్ఛ" అని దశార్ణవ దేశాధీశుడగు 'హేమవర్మ'యను రాజుయొక్క కుమార్తెనిచ్చి వివాహముచేసిరి. తరువాత కొంతకాలమునకు ఆ కోడలు మంచి చతురతగలదియగుటచే, తనభర్త పురుషుఁడు కాఁడనియు, ఇందులో ఏదో మోసమున్నదనియును గ్రహించి తనవ్రాతను తానేనిందించుకొని గుట్టుగనేయున్నది. కాని, కొంతకాలమునకు ఎట్లో దాసికి తెలిసి, 'హేమవర్మ'కు చెప్పగా, కోపించి, ద్రుపదరాజు ఇట్లుమోసముచేయునా? అని యుద్ధమునకు బయలుదేరెను. ఒకరోజు మహాయుద్ధము జరిగినది. సాయంత్రము యోధులందఱును విశ్రాంతిగా నిద్రించుచుండిరి. ఎవరికిని తెలియకుండ శిఖండి నెమ్మదిగా అరణ్యమునకు పారిపోయి, ఒకచోట రహస్యముగా ప్రాయోపవేశమై మరణమునకు సిద్ధపడియుండెను. అక్కడనే నివసించుచున్న స్థూలకర్ణుఁడను ఒక యక్షుఁడు ఇది తెలిసి, వచ్చి "ఏమి యిట్లా నడిచావు చావనేల? నాకుచెప్పిన నేనుచేయగలసహాయమున్న చేసెదను" అనెను. దానికి ఆమె 'ఈస్థితిలో నాకెవ్వరును సహాయముచేయలేరు. ఆ ఒక్కశివుఁడే చేసినచేయవలె" అని తనస్థితినంతయును చెప్పెను. అప్పుడు అతఁడు "అబలా! ఇంత మాత్రమునకే ఇంతభయపడవలయునా? నీస్త్రీత్వమునాకిచ్చి,

నాపుంసత్వమును గ్రహించి, నీవారలకందఱకును నీపుంసత్వము ప్రకటించుకొని, ప్రస్తుతపువిపత్తునుండి బయటపడి, పది రోజులలో మరల నాపుంసత్వము నాకిచ్చి, నీస్త్రీత్వమును నీవు గ్రహించుము. సత్యముతప్పకుము" అని చెప్పి, ఆమెస్త్రీత్వమును గ్రహించి, తనపుంసత్వమును ఆమెకిచ్చి పంపివేసెను. ఆమె తెల్లవారులోపల ఇంటికిపోయి తల్లితండ్రుల కీసమాచారమంతయును చెప్పెను. వారుచాల సంతోషించి, 'హేమవర్మ'ను పిలిపించి, "మమ్మాల నడుగకుండ తొందరపడవచ్చునా?" అనిమందలించి, శిఖండి పుంసత్వమును పరీక్ష చేసికొనుటకు అనుమతించిరి. దానితో ఆరాజుసిగ్గుపడి "ఎవరో చెప్పిన మాటలువిని మోసపోయితిమి." అని ద్రుపదరాజుచే గౌరవమర్యాదల బడసి తమద్రోవను తాము పోయిరి. ఇది ఇట్లుండ శిఖండి ఆస్థూలకర్ణుని పుంసత్వమును తీసికొని అట్లు వెళ్ళగనే మఱునాఁడు, స్థూలకర్ణుని దొరయైన కుబేరుఁడు సపరివారముగా అక్కడకువచ్చెను. అతఁడు స్త్రీరూపముతో కుబేరునికి కనుపడుటకు సిగ్గుపడి ఎదురబడక దాగియుండెను. దానికి కుబేరుఁడు "ఇతఁడు గర్వముచేత తనను లక్ష్యముచేయక ఎదురకు రాలేదు" అనుకొని కుపితుఁడై తనసేవకుల పంపెను. ఆ సేవకులు యధార్థవిషయమును తెలిసికొనివచ్చి, "స్వామీ! అతఁడు శిఖండిస్త్రీత్వమును గ్రహించి తన పురుషత్వమును శిఖండికి యిచ్చియున్నాఁడు. మఱల పదిరోజులలో అతఁడు వచ్చి ఇతని పుంసత్వమును ఇచ్చివేయునట. ఇప్పుడు స్త్రీరూపముతో మీకు ఎదురుబడ సిగ్గుపడుచున్నాఁడు. కాని

గర్వముకాదు." అని విన్నవించిరి. అదివిని "భయములేదు రమ్మనమని" పిలిపించి "సరే ఈస్త్రీత్వముతోనే ఉండిపొమ్ము" అని శపించెను. దానికి అతఁడు పాదములపైబడి ప్రార్థించగా, శిఖండి బ్రతికియున్నంత కాలము నీపురుషత్వము శిఖండికే యుండి, తరువాత మఱల నీకు వచ్చిచేరును." అని అనుగ్రహించిపోయెను. తరువాత తనమాటప్రకారము శిఖండి పది రోజులకురాగా స్థూలకర్ణుఁడు తన సమాచార మంతయును చెప్పి, "నీలోపమేమియునులేదు. నాకర్మ ఇట్లున్నది. పోయి రమ్ము" అని పంపివేసెను. అతఁడును అతి సంతోషమునవచ్చి, తల్లిదండ్రులతో ఈవార్త చెప్ప, వారందఱును శివుని అనుగ్రహమునకు మెచ్చుకొని ఆనందించిరి. ఇదిశిఖండియొక్క వృత్తాంతము. భీష్ముఁడు స్త్రీలతోను, మొదట స్త్రీగాయుండి, తరువాత పురుషుఁడైనవారితోను, పురుషుఁడై యుండి స్త్రీ లక్షణములు కలవారితోను యుద్ధము చేయనని తనకుప్రతిజ్ఞ యున్నట్లు దుర్యోధనునితోఁడ మొదటనే చెప్పియున్నాఁడు. కనుక దుర్యోధనునకు భయము. భీష్ముఁడుపాండవులలో ఎవరినీ చంపనని ప్రతిజ్ఞపట్టియున్నాఁడు. ఆప్రతిజ్ఞ లేకపోయినను పాండవులలో ఏఒక్కరును జంకువారుకారు. 'తాతగారు, అల్లారు ముద్దుగాపెంచి విద్యాబుద్ధులు చెప్పినాఁడు', అనే గౌరవ మర్యాదలుతప్ప "జయించలేము" అని భయపడే వారు పాండవులలో ఒక్కరునులేరు. సామాన్యముగ క్షత్రియ రక్తము ప్రవహించువాఁడే, జయించినజయించును; లేక పోయిన వీరమరణముచెంది వీరస్వర్గము పొందును. అంతియ

కాని, యుద్ధమునకు భయపడడు. అట్టిదిపాండవులా జంకునది! ఇఁక చంపననికూడ ప్రతిజ్ఞయున్నప్పుడు చంపకుండా, ఊరికే బాణములుపెట్టి గ్రుచ్చుతూ, 'పోతావా, పోతావా' అంటే పోవువారా పాండవులు! కనుక భయము దుర్యోధనునికి. పైన శిఖండి యున్నాఁడు. కాబట్టి "మీరందఱును జాగ్రత్తగా భీష్మునివద్దకు శిఖండిని తీసికొనిరాకుండ కాపాడకపోయిన, మొదటిరోజుననే ఆశిఖండిని పెట్టుకుని, ఆపార్థుఁడు వచ్చిన ఇఁక మనకును భీష్మునికిని ఆరోజుతోనే సంబంధము ఆఖరు. ఎన్ని రోజులు బ్రతికినఅన్నిరోజులైనను నాకిచ్చినవాగ్దానము ప్రకారము పదివేలమంది యోధులనైనను సంహరించగలఁడు. ఈ వ్యూహముయొక్క ఏద్వారమునుండి శిఖండి ప్రవేశించి, భీష్మునిచేరునో? సావధానచిత్తులై పరిశీలించుచు జాగ్రత్తగా కాచికొని యుండవలయును." అని దుర్యోధనుఁడు అనెను.

అవతారిక :-

ద్రోణాచార్యులతో దుర్యోధనుఁడు ఇట్లు పలుకుటవిని భీష్ముఁడు ఏమిచేసినదియు సంజయుఁడు ధృతరాష్ట్రునకు చెప్పు చున్నాఁడు.

సంజయ ఉవాచ :-

శ్లో. తస్యసంజనయన్ హర్షం
కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చైః
శ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్. 12

ప. ఛా. తస్య. సంజనయన్. హర్షం. కురువృద్ధః.
పితామహః. సింహనాదం. వినద్య. ఉచ్చైః. శంఖం.
దధ్మౌ. ప్రతాపవాన్.

టీక :—

కురువృద్ధః = కౌరవులలో పెద్దయును,
ప్రతాపవాన్ = ప్రతాపవంతుఁడును,
పితామహః = ధార్తరాష్ట్రులకును, పాండవులకును తాతయునైన (భీష్ముఁడు.)
తస్య = ఆ దుర్యోధనునకు,
హర్షః = సంతోషమును,
సంజనయన్ = కలిగించుచున్నవాఁడై.
ఉచ్చైః = గట్టిగా,
సింహనాదం = సింహనాదమును,
వినద్య = ధ్వనింపఁజేసి,
శంఖం = శంఖమును,
దధ్మౌ = పూరించెను.

తా. కౌరవవృద్ధుఁడైనట్టియును, గొప్పప్రతాపముగలవాఁడునునైన, భీష్మపితామహుఁడు, దుర్యోధనుని హృదయములో కలిగిన భయముపోయి ఆనందోత్సాహముల కలుగఁజేయుటకై, సింహగర్జనవలె గొప్పధ్వనితో శంఖమును పూరించెను.

## అమృతవాహిని :—

భీష్ముఁడు అప్పటికున్న కౌరవులలో వృద్ధుఁడుకాని. పిన తండ్రి ఒక 'బాహ్లీకుఁడు' మాత్రము 'భీష్ముని'కన్న పెద్ద. పాండవులును, కౌరవులునుకూడ భీష్మునికి ఒకటే. తాతగారనే

పూజ్యభావము ఇరుకక్ష్యులవారికిని కలదు. కాబట్టి కురువృద్ధుఁడు పితామహుఁడు అనుచున్నాఁడు సంజయుఁడు. వయస్సులో వృద్ధుఁడైనను, శౌర్యబలపరాక్రమ వీరత్వములలో గొప్ప వీరులైన యువకులకంటె మించినవాఁడు. ఈ భావమును ఉంచుకునియే 'ప్రతాపవాన్' అనుట. ఇటువంటి భీష్ముఁడు, దుర్యోధనుఁడు ద్రోణాచార్యులవద్ద నిలబడి పాండవసేనను చూచి ఆశ్చర్యభయములు పొందుటచూచి, అతనికి ఉత్సాహము కలిగించుటకై, 'నీవేమి భయపడకు నాశక్తి సామర్థ్యములుచూడు' అనుచున్నట్లు సింహముగర్జించునట్లు పెద్దగ శంఖమును పూరించెను.

శ్లో. తతశ్శంఖాశ్చ భేర్యశ్చ
పణవానక గోముఖాః
సహసైవాభ్యహన్యంత
సశబ్దస్తుములోఽభవత్. 13

ప. భా తతః, శంఖాః, చ, భేర్యః, చ, పణవానక
గోముఖాః, సహస, ఏవ, అభ్యహన్యంత, సః,
శబ్దః, తుములః, అభవత్.

టీక :—

తతః=(అంతట.) పిమ్మట,
శంఖాశ్చ=శంఖములును,
భేర్యశ్చ=దుందుభులును,
పణవానకగోముఖాః;
పణవ=తప్పెటలును,

ఆనక = మృదంగములును,
గోముఖాః = బూరలును,
సహసైవ = ఒక్కసారిగానే,
అభ్యహన్యంత = వాయింపఁబడినవి.
సశబ్దః = ఆధ్వని,
తుములః = భయంకరమైనది,
అభవత్ = ఆయెను.

తా. భీష్ముఁడు ఈప్రకారము శంఖమును పూరించగనే ఆకౌరవసైన్యములో అనేకములైన శంఖములు, నగారాలు, డోళ్లు, తప్పెటలు, మొదలగు రణ వాద్యములు ఒక్కసారిగ వాయింపఁబడినవి ఆశబ్దము ఆకాశమంతయును మాఱు మ్రోగునట్లు చాలభయంకరమైనదిగ నుండెను.

అమృతవాహిని :-

భీష్మపితామహుఁడు ఉత్సాహముతో శంఖమును పూరించి సింహనాదము చేయునప్పటికి, అదియే యుద్ధప్రారంభమునకు సంజ్ఞగ తెలిసికొని, అన్నివైపులను ఉత్సాహము, వీరత్వము, వ్యాపించి పొంగిపొరలగా, కౌరవ సైన్యములోని సకలసేనాధిపతులును తమతమ శంఖములను పూరించిరి. అనేక రకములైన రణ వాద్యములు ఒక్కపెట్టున మ్రోయింపఁబడునప్పటికి ఆగొప్పమ్రోతతో ఆకాశము, భూమియును భయంకరముగా మాఱుమ్రోఁగెను.

అవతారిక :-

మొదట ధృతరాష్ట్రుఁడు 'నావారు, పాండవులు ఏమి చేసిర'ని అడిగినప్రశ్నకు, ఇంతవఱకు సంజయుడు ధృతరాష్ట్రుని పక్షమువారు ఏమిచేసినది చెప్పినాఁడు. ఇప్పుడు

పాండవులు ఏమిచేసినదియు అయిదు శ్లోకములలో చెప్పు చున్నాఁడు.

శ్లో. తతశ్శ్వేతైర్హయైర్యుక్తే
మహతి స్యందనే స్థితౌ
మాధవః పాండవశ్చైవ
దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. 14

ప. ఛా. తతః. శ్వేతైః, హయైః, యుక్తే, మహతి,
స్యందనే, స్థితౌ, మాధవః, పాండవః, చ, ఏవ,
దివ్యౌ, శంఖౌ, ప్రదధ్మతుః,

టీ క :—

తతః—తదనంతరము,
శ్వేతైః— తెల్లని,
హయైః—గుఱ్ఱములతో,
యుక్తే—కూడుకొన్నట్టియును,
మహతి—గొప్పదియును, (అగు)
స్యందనే—రథమునందు,
స్థితౌ—కూర్చొనియున్న,
మాధవః—(శ్రీ)కృష్ణుఁడును,
దివ్యౌ—దివ్యములైన (దేవతా సంబంధములైన.)
శంఖౌ—శంఖములను,
ప్రదధ్మతుః—పూరించిరి.

తా. తరువాత తెల్లని గుఱ్ఱములను అమర్చిన గొప్పదగు రథముమీద అధివసించియున్న శ్రీకృష్ణపరమాత్మయును, అర్జునుఁడుమకూడ తమతమ దివ్యములైన శంఖములను పూరించిరి.

**అమృతవాహిని :-**

శ్రీకృష్ణార్జునులు అధివసించిన రథము చాలగొప్పది. దివ్యమైనది. ఖాండవవన దహనసమయమున అగ్నిదేవుఁడు ప్రసన్నచిత్తుఁడై, అర్జునునికి సమర్పించుకొనినాఁడు. ఈరథము బంగారముతోడను, మణులతోను మహా ప్రకాశమానముగ తయారుచేయబడినది. దివ్యమైనది. వాయువేగ మనోవేగ ములుగల, దివ్యహయముల కూర్చఁబడినది. ఈ రథముయొక్క గమనమునకు ఎక్కడను అడ్డులేదు. స్వర్గ, పాతాళ, భూలోకములలో ఎక్కడికైనను అప్రతిహతముగ పోగలదు. చెట్లు, నదులు, పర్వతములు, సముద్రములు ఏవియును దాని గమనమును అడ్డలేవు. దివ్యపతాకము తాండవము చేయుచున్నది. ఆ పతాకముపైన రామభక్తాగ్రేసరుఁడు హనుమాన్ విజయముచేసి యున్నాఁడు. ఆరథమునకు తెల్లని దివ్యములైన నాలుగు గుఱ్ఱములు పూన్చబడియున్నవి. ఆ దివ్యరథములో అధివసించియున్న కృష్ణార్జునులిరువురును తమతమ శంఖములు పూరించినారు. ఆశంఖములు దివ్యములైనవి. భీష్ముఁడు మొదలగువారు యుద్ధారంభసూచకముగ శంఖములు పూరించిన మీఁదట ఆసింహనాదములకు సమాధానముగ "మేముకూడ యుద్ధమునకు సిద్ధముగ నున్నామ"నుచు వీరు ఈ దివ్యశంఖముల పూరించిరి.

**అవతారిక :-**

పాండవుల పక్షమున కృష్ణార్జునులు శంఖములు పూరిం

చుట, తరువాత ఇతరులు వారివారిశంఖముల పూరించుటయు వివరముగ చెప్పుచున్నాడు సంజయుఁడు.

శ్లో. పాంచజన్యం హృషీకేశో
దేవదత్తం ధనంజయః
పౌండ్రందధ్మౌ మహాశంఖం
భీమకర్మా వృకోదరః. 15

ప. ఛా. పాంచజన్యం, హృషీకేశః,
దేవదత్తం, ధనంజయః, పౌండ్రం, దధ్మౌ,
మహాశంఖం, భీమకర్మా, వృకోదరః.

టీక:—

హృషీకేశః=శ్రీకృష్ణుఁడు,
పాంచజన్యం=పాంచజన్యమను శంఖమును,
దధ్మౌ=పూరించెను,
ధనంజయః=అర్జునుఁడు,
దేవదత్తం=దేవదత్తమను శంఖమును,
(దధ్మౌ=పూరించెను).
భీమకర్మా=భయంకరకృత్యములను చేయునట్టి,
వృకోదరః=భీముఁడు,
పౌండ్రం=పౌండ్రమను పేరుగల,
మహాశంఖం=గొప్పశంఖమును,
(దధ్మౌ=పూరించెను).

తా. 'పాంచజన్యమ'ను శంఖమును కృష్ణుఁడును, 'దేవదత్తమ'ను శంఖమును అర్జునుఁడును, 'పౌండ్రమ'ను పేరుగల మహాశంఖమును భయంకరకర్మలు చేయుభీముఁడును పూరించిరి.

అమృతవాహిని:-

హృషీకేశుఁడు పాంచజన్యమునుపూరించెను. శ్రీకృష్ణ పరమాత్మకు హృషీకేశుఁడు అనికూడపేరు. హృషీకములు అనగా ఇంద్రియములు. వానికి ఈశుఁడు కనుక హృషీకేశుఁడు. 'హృషీకానాం ఇంద్రియాణాంఈశః=హృషీకేశః.' ఈయన శంఖముపేరు పాంచజన్యము. పంచజనుఁడనెడి శంఖరూప రాక్షసుఁడు. వానినిజంపి శంఖముగ ఉపయోగించుకొనినాఁడు పరమాత్మ. అందువలన ఆ శంఖమునకు 'పాంచజన్యము' అని పేరువచ్చినది. 'దేవదత్తమ'ను శంఖమును అర్జునుఁడు పూరించెను. ధర్మరాజు రాజసూయయజ్ఞము చేసినప్పుడు అర్జునుఁడు దిగ్విజయముచేసి, అనేకమంది రాజులను జయించి, అపారమైన ధనము తీసికొనివచ్చుటచే 'ధనంజయుఁడు' అనిపేరు కలిగినది. అర్జునుని శంఖముపేరు దేవదత్తము. దేవతల పక్షమున నివాతకవచాది దైత్యులతో యుద్ధముచేయునప్పుడు. ఇంద్రునిచేత నివ్వఁబడినది. కనుక, 'దేవదత్తమ'ని పేరు వచ్చినది. ఈశంఖమును పూరించిన, శత్రువుల హృదయములు బ్రద్దలగును. 'పౌండ్రమ'ను మహాశంఖమును భీముఁడు పూరించెను. భీమునికి 'భీమకర్ముఁడ'నియు, 'వృకోదరుఁడ'నియు పేర్లు కలవు. భీమునిచేత చేయబఁడు ప్రతికర్మయును శత్రుభయంకరముగానుండును. అందువలన, 'భీమకర్ముఁడ'నిపేరు. భీముఁడు భుజించెడి ఆహారము అపరిమితము కాబట్టియును, అంత భోజనము జీర్ణింపఁజేసికొనెడిశక్తియు నుండుటచే 'వృకోదరుఁడు' అని పేరుకలిగినది. అతనిశంఖము 'పౌండ్రము'. అర్జునాగ్ర

పెద్దది. అదిపూరించిన చాలగొప్ప శబ్దమువచ్చును. ఆశబ్ద మును వినునప్పటికే శత్రుసైన్యములోని వీరుల హృదయ ములు బ్రద్దలగును. కాబట్టి ఆశంఖమునకు 'మహాశంఖము'ని పేరు వచ్చినది.

శ్లో. అనంతవిజయం రాజా
కుంతీపుత్రోయుధిష్ఠిరః
నకులస్సహదేవశ్చ
సుఘోషమణి పుష్పకౌ. 16

ప. ఛా. అనంతవిజయం, రాజా, కుంతీపుత్రః
యుధిష్ఠిరః, నకులః, సహదేవః, చ,
సుఘోషమణిపుష్పకౌ.

టీక :-

అనంతవిజయం=అనంతవిజయమనుశంఖమును,
నకులః=నకులుఁడును,
సహదేవశ్చ=సహదేవుఁడును,
సుఘోషమణిపుష్పకౌ=సుఘోషము,
మణిపుష్పకమునను శంఖములను.

తా. కుంతీపుత్రుఁడైన ధర్మరాజు 'అనంతవిజయము'ను శంఖమును పూరిం చెను. నకులుఁడును, సహదేవుఁడును, తమతమ 'సుఘోషము','మణిపుష్పకము' అను శంఖములను పూరించిరి.

అ మృ త వా హి ని :-

కుంతీపుత్రుఁడైన యుధిష్ఠిరమహారాజు (ధర్మరాజు) 'అనంతవిజయము'ను శంఖమును పూరించెను. ఇక్కడ ధర్మ

రాజు కుంతీపుత్రుఁడని,యుధిష్ఠిరుఁడని, రాజని విశేషణములతో చెప్పఁబడినది. యుధిష్ఠిరుఁడనగా 'యుద్ధమునందు స్థిరముగా నుండువాఁడు' అని అర్థము. ఈ శబ్దప్రయోగముచే సంజయుఁడు, యుద్ధములో ధర్మరాజును ఎవరును జయించలేరు. ఆయనకేవిజయమని సూచించుచున్నాఁడు. 'రాజా' అని ప్రయోగించి, ఇదివఱకు రాజ్యము చేసియుండుటచేతను, ఇప్పుడుకూడ యుద్ధములో ఆయనకే జయము సంప్రాప్తించి, ఆయనయే రాజుకాగలఁడనియును, సంజయుఁడు ధృతరాష్ట్రునికి సూచించుచున్నాఁడు. నకులుఁడును, సహదేవుఁడును కూడ 'సుఘోషము', 'మణిపుష్పకము' అను తమ తమ శంఖములను పూరించిరి.

శ్లో. కాశ్యశ్చపరమేష్వాస
శ్శిఖండీచ మహారథః
ధృష్టద్యుమ్నోవిరాటశ్చ
సాత్యకిశ్చాపరాజితః. 17

ప భా. కాశ్యః. చ. పరమేష్వాసః, శిఖండీ,
చ. మహారథః. ధృష్టద్యుమ్నః. విరాటః.
చ. సాత్యకిః. చ. అపరాజితః.

టీక :—

పరమేష్వాసః=గొప్పవిల్లుగల,
కాశ్యశ్చ=కాశీదేశపురాజును,
మహారథః=మహారథికుఁడైన,
శిఖండీచ=శిఖండియును,

ధృష్టద్యుమ్నశ్చ=ధృష్టద్యుమ్నుఁడును,
విరాటశ్చ=విరటుఁడును,
అపరాజితః=అపజయము లేనివాఁడగు,
సాత్యకిశ్చ=సాత్యకియును,

శ్లో. ద్రుపదో ద్రౌపదేయాశ్చ
సర్వశః పృథివీపతే
సౌభద్రశ్చ మహాబాహుః
శంఖాన్దధ్ముః పృథక్ పృథక్. 18

ప. ఛా. ద్రుపదః, ద్రౌపదేయాః, చ,
సర్వశః, పృథివీపతే, సౌభద్రః,
చ, మహాబాహుః, శంఖాన్,
దధ్ముః, పృథక్, పృథక్.

టీ క :-

ద్రుపదః=ద్రుపదరాజును,
ద్రౌపదేయాశ్చ=ఉపపాండవులును,
మహాబాహుః=బాహుబలసంపన్నుఁడైన,
సౌభద్రశ్చ=అభిమన్యుఁడును,
సర్వశః=అందఱును,
పృథక్ పృథక్=వేఱువేఱుగా,
శంఖాన్=శంఖములను,
దధ్ముః=పూరించిరి.

17, 18, తా. గొప్పధనుస్సుగల కాశీరాజును, మహారథుఁడైన శిఖండియును, ధృష్టద్యుమ్నుఁడును, విరటుఁడును, పరాజయములేని సాత్యకియును, ద్రుప

ండును, ద్రౌపదేయులును (ద్రౌపది కుమారులైదుగురు), మహాబాహువగు
సుభద్రాపుత్రుడు అభిమన్యుడును అందఱును తమతమ శంఖములను వేఱువేఱుగ
పూరించిరి.

అమృత వాహిని :-

కాశీరాజు, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, సాత్యకి, ద్రుపదుడు, ద్రౌపదియొక్క అయిదుగురు కుమారులు, అభిమన్యులను గుఱించి నాలుగు, అయిదు, ఆఱుశ్లోకముల యొక్క వ్యాఖ్యానములోను, శిఖండినిగుఱించి పదునొకండవ శ్లోక వ్యాఖ్యానములోను పాఠకులకు పరిచయము చేయఁబడినది. 'సర్వశః' అందఱు అనుటలో ఇక్కడ పేర్లు చెప్పఁబడినవారుగాక, పాండవసేనలోని అతిరథులు, మహారథులు, సర్వులును తమతమ శంఖములను పూరించిరి అని భావము. సంజయుఁడు కౌరవపక్షములోని వీరులు శంఖములు పూరించి నట్లు చెప్పియున్నాఁడు. పాండవులపక్షములోని వీరులుకూడ శంఖములు పూరించినట్లు చెప్పియున్నాఁడు. కాని, ఒక కృష్ణుఁడు, పాండవులు అయిదుగురు, మొత్తము ఈ ఆఱుగురి శంఖముల పేర్లుమాత్రమే ఉగ్గడించియున్నాఁడు. పాండవుల పక్షములోని ఇంకెవరి శంఖములపేర్లు చెప్పలేదు. కౌరవపక్షములోని ఏఒక్క మహావీరుని శంఖముపేరును చెప్పలేదు. ఏమికారణము? మిగిలిన అన్ని శంఖములకంటె ఈ ఆఱుగురి శంఖములకు ఒక గొప్ప విశిష్టతకలదు. ఈ శంఖములు పూరించి, ధ్వనిచేసినయెడల ఆ ధ్వని చాలపెద్దదిగ నుండుట మాత్రమేకాదు. శత్రువుల హృదయములు బ్రద్దలగును. భీముఁడు సింహనాదము చేసి

నప్పుడెల్లను, శత్రుసైన్యములోని పది వేలమంది వీరులగుండెలు పగిలి చనిపోయిరని మహాభారతములో నున్నది.

శ్లో॥ సఘోషోధార్తరాష్ట్రాణాం
హృదయాని వ్యదారయత్
నభశ్చపృథివీంచైవ
తుములోఽవ్యను నాదయన్. 19

ప. ఛా. సః, ఘోషః, ధార్తరాష్ట్రాణాం, హృదయాని, వ్యదారయత్, నభః, చ, పృథివీం, చ, ఏవ తుములః, వ్యనునాదయన్.

టీక :—

తుములః = భయంకరమైన,
సఘోషః = ఆశబ్దము,
నభశ్చ = ఆకాశమును,
పృథివీంచైవ = భూమిని,
వ్యనునాదయన్ = మారుమ్రోగించుచు,
ధార్తరాష్ట్రాణాం = దుర్యోధనాదులయొక్క,
హృదయాని = గుండెలను,
వ్యదారయత్ = బ్రద్దలుచేసెను.

తా. ఆధ్వని ఆకాశమును, భూమినికూడ వ్యాపించి మారుమ్రోగించుచు దుర్యోధనాదుల హృదయములను బ్రద్దలుచేసెను.

అ మృ త వా హి ని :—

సంజయుఁడు చెప్పుచున్నాఁడు. ఓధృతరాష్ట్రా! నీవుఇంకను నీ పుత్రులుజయింతురని ఆశపెట్టుకుని యున్నావేమో! శ్రీకృష్ణా

ర్జునులు మహానుభావులు, నరనారాయణులు ఆదివ్యరథమువిూద అధిష్ఠించి ఆశంఖములు పూరించిన, ఆభీముఁడు, ఆధర్మరాజు, ఆనకులసహదేవులు వారివారిశంఖములు పూరించిన వారి శంఖములు సామాన్యములా? మిగిలిన మానవులకంటె, వారెట్లు విలక్షణమైనవారో, కేవలము దేవతాంశ సంభూతులో, వారిశంఖములు కూడనట్లే. ఆ శంఖములను వారు పూరించునప్పటికి శత్రువుల గుండెలు బ్రద్దలుకావా? నీ కుమారులు ఎప్పుడును శంఖధ్వనులు వినలేదా? వారు మాత్రము పిరికివారా? ఇదివఱకు యుద్ధములు ఎఱుగరా? అయిననేమి? కృష్ణుఁడు, పాండవులు సామాన్యులుకారు. వారి శంఖములు సామాన్యములుకావు. వారుపూరించుట సామాన్యముకాదు. ఆ వెడలినధ్వని సామాన్యముకాదు. ఏమో తెలియదు. ఆ శంఖములధ్వని చెవులఁబడు నప్పటికి వారి హృదయములు విదీర్ణములై పోయినవి. గుఱ్ఱములు, ఏనుఁగులు మలమూత్రములు విడిచినవి. ఆ సింహనాదములు ఒక్కసారిగా కలిసి ధ్వనించునప్పటికి ఆధ్వని భూమిఅంతయు వ్యాపించినది. పర్వతములు, నదులు, సముద్రములతో కూడుకొన్న భూమియంతయు దద్దరిల్లిపోయినది. ఆకాశమంతయును, పర్వతగుహలును మాఱు మ్రోగిపోయినవి. అదివఱకే పాండవుల సేనను జూచునప్పటికే భయముతో కొందల మందుచున్ననీవారి హృదయములు ఇప్పుడు ఎఱ్ఱగా కాలియున్న పదునైన శస్త్రములతో చీల్చఁబడుచున్నట్లు బాధపొందినవి. "అయితే నాకుమారుఁడుదుర్యోధనుఁడు ఎన్నోసార్లు, 'పాండవులను సులభముగా జయించ

గలము' అని నావద్దపలికియున్నాఁడు" అందువా? నిజమే! ఇంతవఱకును రాజ్యముకొఱకై ధర్మరాజు హింసారూపమైన యుద్ధమునకు దిగడు అను ఆశ బాగాయున్నది నీకుమారునికి. కాబట్టి యుద్ధము జరుగదనే భావముండుటచే, ఎన్నైనను ప్రజ్ఞలు పలుకవచ్చును. మీవారి సైన్యములు చూచువఱకును ఉత్తరగోగ్రహణములో ఉత్తరుఁడు పలుకలేదా? ఆ ఉత్తరకుమారప్రజ్ఞలే మీవాఁడును పలికినాఁడు. ఆఉత్తరునకు మీసైన్యములను చూచునప్పటికి భయముతో వణుకు పుట్టినది. అయితే నీ కుమారుఁడు దురభిమానము కలవాఁడగుటచే ఎంతభయము పుట్టినను, ఉత్తరునివలె పారిపోయిరాలేదు. ఇది ఉత్తరునికన్న ఒక సుగుణము. పట్టుదలకు అభిమానము కొలదిని చచ్చుటకైనను సిద్ధపడుచున్నాఁడు. కాని హృదయములో ఆవేదన, భయము పెనగొని వేధించుట మొదలు పెట్టినవి.

అవతారిక :-

తరువాత నేమి జరిగినదో వినగోరు ధృతరాష్ట్రునికి సంజయుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అథవ్యవస్థితాన్ దృష్ట్వా
ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే
ధనురుద్యమ్య పాండవః, 20

వ॥ భా॥ అథ, వ్యవస్థితాన్, దృష్ట్వా, ధార్తరాష్ట్రాన్, కపిధ్వజః, ప్రవృత్తే, శస్త్రసంపాతే, ధనుః, ఉద్యమ్య, పాండవః,

టీక :—

అధ = అనంతరము,
శస్త్రసంపాతే = ఆయుధప్రయోగము,
ప్రవృత్తే(సతి) = ఆరంభముకాబోవుచుండగా,
కపిధ్వజః = కపిధ్వజుఁడైన,
పాండవః = అర్జునుఁడు,
వ్యవస్థితాన్ = యుద్ధసన్నద్ధులైయున్న,
ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను,
దృష్ట్వా = చూచి,
ధనుః = ధనుస్సును,
ఉద్యమ్య = పైకెత్తి,

శ్లో॥ హృషీకేశం తదావాక్య
మిదమాహ మహీపతే!

ప॥ ఛా॥ హృషీకేశం, తదా, వాక్యం, ఇదం, ఆహ, మహీపతే.

టీక —

తదా = ఆసమయమున,
హృషీకేశం = శ్రీకృష్ణునిగూర్చి,
ఇదంవాక్యం = ఈవాక్యమును,
ఆహ = పలికెను.

అర్జున ఉవాచ :—

శ్లో॥ సేనయో రుభయోర్మధ్యే
రథం స్థాపయ మేఽచ్యుత!

శ్లో॥ యావదేతాన్నిరీక్షేహం
యోద్ధుకామానవస్థితాన్,
కైర్మయాసహయోద్ధవ్య
మస్మిన్ రణసముద్యమే. 22

ప॥ భా॥ సేనయోః, ఉభయోః, మధ్యే, రథం, స్థాపయ, మే, అచ్యుత, యావత్, ఏతాన్, నిరీక్షే, అహం, యోద్ధుకామాన్, అవస్థితాన్, కైః, మయా, సహ, యోద్ధవ్యం, అస్మిన్, రణసముద్యమే॥

టీక:—

హేఅచ్యుత=ఓకృష్ణా!
అస్మిన్=ఈ,
రణసముద్యమే=యుద్ధముయొక్క ప్రారంభమునందు,
మయా=నాచేత,
కైస్సహ=ఎవరితో,
యోద్ధవ్యం=యుద్ధముచేయదగినదో,
యోద్ధుకామాన్=యుద్ధముసేయకోరికగలవారలై,
అవస్థితాన్=ఎదుటనిలచియున్న,
ఏతాన్=వీరిని,
యావత్=ఎంతలో,
అహం=నేను,
నిరీక్షే=చూతునో, (తావత్=అంతవరకు)
ఉభయోః=రెండగు,
సేనయోః=సేనలయొక్క,

మధ్యే=నడుమను,
(రెండుసేనలలోనివారిని బాగుగచూచుటకు వీలగుచోట)
మే=నాయొక్క,
రథం=రథమును,
స్థాపయ=నిలుపుము.

తా॥ 20, 21 ఓ ధృతరాష్ట్ర మహారాజా! తరువాత కపిధ్వజుఁడైన అర్జునుఁడు, నీ పుత్రులైన దుర్యోధనాదులు యుద్ధమునకు సిద్ధముగానుండుట జూచి ఒకరిమీద ఒకరు శస్త్రప్రయోగముచేసికొను సమయమురాగా విల్లెక్కుపెట్టి కృష్ణపరమాత్మతో ఇట్లుచెప్పెను

తా॥ 22 యుద్ధముచేయుటకై సంసిద్ధులైన వీరందరిని నేను చూచెదను ఈ యుద్ధమునందు నేనెవరితో యుద్ధము చేయవలయునో నిర్ణయించుకొందును.

శ్లో॥ యోత్స్యమానానవేక్షేఽహం
యఏతేఽత్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే
ర్యుద్ధే ప్రియచికీర్షవః. 23

ప॥ భా॥ యోత్స్యమానాన్, అవేక్షే, అహం, యే, ఏతే, అత్ర, సమాగతాః, ధార్తరాష్ట్రస్య, దుర్బుద్ధేః, యుద్ధే, ప్రియచికీర్షవః.

టీక :—

దుర్బుద్ధేః=చెడ్డతలంపుగల,
ధార్తరాష్ట్రస్య=దుర్యోధనునికి,
ప్రియ చికీర్షవః=ఇష్టముచేయు తలంపుగలవారై,
యుద్ధే=యుద్ధమునందు,
యేఏతే=ఏవీరు, (కౌరవసేనలోని వీరులు)

అత్ర = ఇచ్చట,
సమాగతాం = వచ్చికలిసికొని యున్నారో,
యోత్స్యమానాన్ = (అట్టి) యుద్ధము చేయగలవారిని,
అహం = నేను,
అవేక్షే = చూచెదను.

తా॥ దుష్టబుద్ధియగు దుర్యోధనునికి యుద్ధమునందు ప్రియము చేయు నభిప్రాయముతో ఏయే వీరపురుషులు ఇక్కడ (ఈ కురుక్షేత్రములో) సమావేశమై యున్నారో చూచెదను (అంతవఱకు ఉభయసేనా మధ్యమశోణిలో రథమును నిల్పుము అనిభావము)

## అ మృ త వా హి ని :-

ఇట్లు కౌరవవీరులు, పాండవవీరులు ఒకరికొకరు మేము యుద్ధమునకు సిద్ధముగా నున్నామనగ మేమును యుద్ధమునకు అంతకంటె ముందుగానే సిద్ధముగ నున్నామని శంఖధ్వానములతో, సింహనాదములతో తెలుపుకున్న తరువాత, ధార్తరాష్ట్రులు శస్త్రప్రయోగమునకు సిద్ధముగానున్న సమయమున కపిధ్వజుండైన అర్జునుడు తన విల్లునెక్కుపెట్టి హృషీకేశునితో ఈ వాక్యమును పలుకుచున్నాడు. అర్జునుడు కపిధ్వజుడెట్లుఅయినాడు? అరణ్యావాసము చేయు సమయములో, ఒకప్పుడు పాండవులు గంధమాదనపర్వతమునకుపోయి బదరీనారాయణమున నున్నతరి, ఒకనాడు గాలివశమున ఒక సౌగంధికకమలము వారి సమీపమునఁబడ దానినిజూచి పాండవులందఱును ఆశ్చర్యపోయిరి. దానికి సహస్రదళములు. ఏ పుష్పములకు ఉండని అద్భుతసౌరభమును, ఎప్పుడునువాడక వికసించి,

సౌరభమును వెదజల్లుచుండుట, ఈ లక్షణములుగల సౌగంధిక పుష్పమును జూచునప్పటికి ద్రౌపదికి దానిమీద కాంక్షగలిగి భీమసేనునితో 'ఈ కమలములు ఇక్కడకు కొలదిదూరమున చాలగలిగియుండవచ్చును. లేకున్న గాలికి ఈ ఒక్కపుష్పము ఎట్లు కొట్టుకొనివచ్చును? కాన ఈ పుష్పములు ఎక్కడ నున్నవో చూచి ఇటువంటి పుష్పములు పెక్కులు తెచ్చిపెట్టి నామనస్సునకు ఆనందము కలిగింపుఁడు.' అని ప్రార్థించెను. భీమసేనుఁడు దానికొఱకు ఆ గంధమాదన పర్వతముమీద వెదకుచు పోయి పోయి ఒకచోట తన అన్నగారైన హనుమన్నను దర్శించి నప్పుడు, ఆ హనుమన్న తమ్ముఁడైన భీమన్నను జూచి సంతసించి 'భారతయుద్ధములో అర్జునుని రథముపైన జండామీదకూర్చొని, నీవు సింహనాదము చేసి నప్పుడు నీ సింహనాదములో కలిపి నేనుకూడ చేయుదును. ఆ ధ్వనికి శత్రువుల గుండెయులవియ చత్తురు.' అని వరమిచ్చెను. ఆ వరము ప్రకారము హనుమంతుఁడు అర్జునుని జండాపై ఉండును. కనుక అర్జునునికి కపిధ్వజుఁడు అని పేరువచ్చినది. హృషీకేశునికి అర్థము పదిహేనవశ్లోకవ్యాఖ్యానములో చూడ నగును. దుర్యోధనాదులు శస్త్రములు పైకెత్తి యుద్ధమునకు సిద్ధముగానుండుటఁ జూచునప్పటికి అర్జునునకు వీరరసము ఉప్పొంగినది. ఉడుకురక్తము నాడులవెంట వేగముగ ప్రవహించసాగినది. వెంటనే తన గాండీవమునుకూడ ఎక్కుపెట్టి 'అచ్యుతా! ఒకసారి మనరథమును ఉభయసేనా మధ్యమక్షోణిలోనికి పోనిమ్ము' అనినాఁడు. 'అచ్యుతా!' అని

సంబోధనచేయుటలో అర్జునునికి ఎంతభావము ఇమిడియున్న దనగా–అచ్యుతుఁడు–అనగా 'చ్యుతి'లేనివాఁడు. చ్యుతి అనగా జారుట, పడుట, నాశనము, మార్పు,తొలగుట–ఇవి లేనివాఁడు అచ్యుతుఁడు. ఎవఁడు తన సిద్ధాంతమునుండి, తన స్వరూపము నుండి, తనమహత్త్వమునుండి,ఎప్పుడును, ఎట్టి సందర్భములోను స్ఖలితుడుకాఁడో, మార్పుచెందఁడో, నాశనములేనివాఁడో, వికారములులేనివాఁడో, వాడు అచ్యుతుఁడు.

"స్వస్వరూపాత్, స్వసామర్థ్యాత్, స్వపదాత్, నచ్యవతే, ఇతి అచ్యుతః, షడ్వికారరహితత్వాత్ అచ్యుతః" తనకు సారథియైనవాఁడు ఈ అచ్యుతుఁడు. సాక్షాత్ పరమాత్మకనుక కృష్ణునితో, "నీవు నా రథమును తోలుచున్నావు. నా భాగ్యము ఏమిచెప్పను? కనుక నా రథమునకు నాకు ఎప్పుడును ఎక్కడను పరాభవము, పరాజయము కలుగదు. నీచేత తోలఁబడు ఈ రథము సంగ్రామములో అజేయము." అను భావమును సూచించుచు,'అచ్యుతా !'అని సంబోధించినాఁడు.

"యుద్ధసేయుటకై ఎవరెవరువచ్చియున్నారో, నేనెవరితో యుద్ధముసేయవలయునో ముందు నిర్ణయించుకొన వలయును. అంతవఱకు ఎక్కడ నిలబడియున్నచో ఇట్లుచూడగలుగుదునో అక్కడ ఉభయసేనలమధ్య రథమునిలుపుము. ఎంతసేపు? ఎవరితో యుద్ధముచేయవలయునో నిర్ణయించుకొనువఱకును రథము నిలుపవలసినది." అని కృష్ణపరమాత్మతో చెప్పుచున్నాఁడు. శరీరమొక రథము. ఆత్మ రథికుడు. ఇంద్రియములు

గుఱ్ఱములు. బుద్ధి సారధి. సారధిస్థానములో మనబుద్ధిని తొల గించి కృష్ణపరమాత్మను పెట్టిననాడు- ఆయన హృషీకేశుఁడు గనుక; అనగా ఇంద్రియములకు ప్రభువు, నియమించువాఁడు గనుక- ఈరధముయొక్క గుఱ్ఱములను ఎట్లు ఎప్పుడు నడుప వలయునో అట్లు అప్పుడు నడుపఁగలఁడు.ఎట్లు ఎప్పుడు ఎక్కడ నిలుపవలయునో అట్లు అప్పుడు అక్కడ నిలుపఁగలఁడు. కనుక కృష్ణునే సారధిగా ఎన్నుకొని రధము తోలుమనుచున్నాఁడు.

"దుర్యోధనుఁడుదుర్బుద్ధి తనహితముపరులహితముకూడ తెలిసికొనలేనివాఁడు. దురభిమానము, మూర్ఖపు పట్టుదల గలవాఁడు. ఇతరుల ఉన్నతిచూచి ఓర్వలేనివాఁడు. ఇతరులు తనకు ఉపకారముచేసినను అది అవమానముగా తలంచి, విరోధము వహించి కక్షసాధించువాఁడు. కనుకనే ఇంతకు వచ్చినది. అట్టిదుర్యోధనునికి యుద్ధములో సహాయము చేయుటకై ఏయే రాజులు వచ్చియున్నారో, వారినందఱిని చూడవలసియున్నది. మాయజూదములో ఓడించి, ద్రౌపదిని నిండుసభలో అవ మానపరచి, మఱల రెండవమారు జూదములో అన్యాయ ముగా రాజ్యమునంతయును తీసికొనునప్పుడు, పంద్రెండు సంవత్సరములు అరణ్యావాసము, ఒక సంవత్సరము అజ్ఞాత వాసము సక్రమముగా నిర్వర్తించి వచ్చినయెడల మఱల మా రాజ్యము మాకిచ్చునట్లు ఏర్పాట్లు చేసికొనికూడ ఇప్పుడుఎంతమంది పెద్దలుచెప్పినను ఈయననుట మూర్ఖత్వము, దుర్బుద్ధికాదా? ఇది తెలిసి తెలిసికూడ ఆ దుర్బుద్ధియైన

దుర్యోధనునికి సహాయముచేయుటకై ఏయేరాజులు వచ్చి యున్నారో వారిది అన్యాయముకాదా!

అయితే 'క్షత్రియులకు యుద్ధము ధర్మము కనుక, వారిష్టఇము వచ్చినపక్షమునకువారువచ్చి యున్నారు' అనిన యెడల అదియునుకాదు. క్షత్రియులకు ధర్మయుద్ధమున్యాయము గాని, అధర్మయుద్ధము న్యాయమా? కాదే. ఇప్పుడు మనము చేయునది ధర్మయుద్ధము. ఎందులకన మనము జూదములో ఓడిపోయినప్పుడు యథార్థముగా శక్తి సామర్థ్యములుండికూడ మనరాజ్యమువారలకిచ్చి, అడవులకుపోయి, ఎన్ని బాధలోపడి, నిర్ణయముప్రకారమువచ్చి, మనరాజ్యముమనకిమ్మని అడిగి నాము. 'ససేమిరా! ఈయన'న్నాడు. మనము క్షత్రియులము గనుక, క్షత్రియధర్మము ప్రకారము మనరాజ్యముకొఱకు యుద్ధముచేయుచున్నాము. కనుక మనది ధర్మయుద్ధము. అధర్మయుద్ధమునకై, దుర్యోధనునికి సహాయముగావచ్చిన ఈ రాజులు ఎట్టి వివేకవంతులు? ఎవరైనను కూలికి విషము త్రాగుదురా! కాబట్టి యీవచ్చినరాజులెవరో, నేనెవరితో యుద్ధము ప్రారంభించ వలయునో, చూచుకొనవలయును. కనుక మనరథమును ఒకసారి అచ్యుతా! అటుతోలుము." అనుచున్నాడు అర్జునుడు.

అ వ తా రి క :-

అర్జునుడు ఇట్లుచెప్పినమీదట కృష్ణపరమాత్మ ఏమి చేసినాడు? ఈవిషయమును సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పుచున్నాడు.

సంజయ ఉవాచ —

శ్లో॥ ఏవముక్తో హృషీకేశో
గుడాకేశేన భారత!
సేనయో రుభయోర్మధ్యే
స్థాపయిత్వా రథోత్తమమ్॥ 24

శ్లో॥ భీష్మద్రోణ ప్రముఖత
స్సర్వేషాం చ మహీక్షితామ్।
ఉవాచపార్థ! పశ్యైతాన్
సమవేతాన్ కురూ నితి॥ 25

ప॥ ఛా॥ ఏవమ్, ఉక్తః, హృషీకేశః, గుడాకేశేన, భారత, సేనయోః,
ఉభయోః, మధ్యే, స్థాపయిత్వా, రథోత్తమమ్॥ 24
భీష్మద్రోణప్రముఖతః, సర్వేషాం, చ, మహీక్షితాం, ఉవాచ,
పార్థ, పశ్య, ఏతాన్, సమవేతాన్, కురూన్, ఇతి,॥ 25

టీక :—

హేభారత—ఓ ధృతరాష్ట్రమహారాజా!
గుడాకేశేన—అర్జునునిచేత,
ఏవం—ఈ ప్రకారముగా,
ఉక్తః—చెప్పబడిన,
హృషీకేశః—కృష్ణపరమాత్మ,
ఉభయోః సేనయోః—రెండుసేనలయొక్క,
మధ్యే—నడుమను,
భీష్మద్రోణప్రముఖతః—భీష్మద్రోణులయెదుటను,
చ—మఱియును,

సర్వేషాం = సమస్తమైన,
మహీక్షితాం = రాజులయొక్క యెదుటను,
రథోత్తమం = శ్రేష్ఠమైన రథమును,
స్థాపయిత్వా = నిలిపి,
హేపార్థ = అర్జునా!
సమవేతాన్ = చేరియున్న,
ఏతాన్ = ఈ,
కురూన్ = కౌరవులను,
పశ్య = చూడుము,
ఇతి = అని,
ఉవాచ = పలికెను.

తా సంజయుఁడు చెప్పుచున్నాఁడు ఓ ధృతరాష్ట్రా! అర్జునుఁడు కృష్ణునితో ఇట్లు చెప్పగా, కృష్ణుఁడు ఉభయసేనలమధ్య, భీష్ముఁడు, ద్రోణుఁడు, ఇంకను ఇతరులైన మహీపతులయొక్క సమ్ముఖమున తన రథోత్తమమును తీసికొనిపోయి నిలిపి, అర్జునా! యుద్ధము చేయుటకై సమావేశమైన ఈ కౌరవులను జూడుము అనిచెప్పెను.

## అ మృ త వా హి ని :-

గుడాకేశుఁడు అనగా అర్జునుఁడు. అర్జునునకీపేరు ఎట్లు వచ్చినదనగా గుడాకా + ఈశ = గుడాకేశ; గుడాకా = నిద్రకు, ఈశః = ప్రభువు, అనగా నిద్రమీద అధికారము కలవాఁడు. నిద్రను జయించినవాఁడు. నిద్ర అనగా జనసామాన్యమైన నిద్రనే అర్థముగా గైకొన్నప్పుడు నిద్రను స్వాధీనములో ఉంచుకొన్నవాఁడు, అని అర్థము. శరీరమునకు సహజముగా

ఎంత కావలయునో, ఎంత తక్కువ నిద్రతో శరీరారోగ్యమును బాగా కాపాడుకోగలమో అంతకంటె ఎక్కువ నిద్రపోని వాఁడు. ఆ నిద్ర అయినను తన స్వాధీనములోనుండి, తాను రమ్మని ఆజ్ఞయిచ్చిన వచ్చును. లేకున్న రాదు. అట్టివాఁడే నిజముగా నిద్రను జయించినవాఁడు. రెండవది- నిద్రఅన హెచ్చరిక తప్పియుండుట. ఇది లేనివాఁడు గుడాకేశుఁడు. అర్జునుఁడు ఎప్పుడును, ఎక్కడను, ఎట్టిపరిస్థితులలోను హెచ్చరిక తప్పి ఒక్కక్షణమైనను ఉండఁడు. ఎప్పుడును ఉత్సాహ పూరితుఁడై యుండును. మందముగా నుండుట, ఆలస్యము, సోమరితనము, కునికిపాట్లు పడుచుండుట, పొరపాట్లు పడు చుండుట-ఇవన్నియును హెచ్చరిక తప్పియుండుటకు అర్థము. ఇది ఏమాత్రమున్నను అట్టివాఁడు ఐహికముగాను, పరమార్థ ముగాను తన్నుతానే అధోగతికి త్రోసికొనువాఁడగును. కనుక ప్రతి సాధకుఁడును అర్జునునివలె గుడాకేశుఁడు కావల యును. కొంచెము కన్నుమరగి యున్నయెడల సాధకుని ప్రకృతి తన సుడిగుండములోనికి లాగుకొనును. ఈ జీవితమే ఒక కురుక్షేత్రము. జీవితములోని అనేక వ్యతిరేక విషమ పరి స్థితులను ఎదుర్కొనుటయే యుద్ధము. శరీరమే రథము. ఇంద్రియములే గుఱ్ఱములు. మనస్సే కళ్ళెము. బుద్ధి సారథి. జీవుఁడే రథికుఁడు. ఇరుకుదారిని నడువవలసి యున్నది. రెండు ప్రక్కలను అగాధము. ఏమాత్రము హెచ్చరిక తప్పియున్నను అధఃపతనమే. ఇట్టియెడ గుఱ్ఱములు మంచి సాత్త్విక బలము కలిగి క్రమశిక్షణలో ఆరితేరి యుండవలయును. రథము చాల

గట్టిదిగ నుండవలయును. సారథి మంచి సమర్థుఁడుగను, సాత్త్వికుఁడుగను ఉండవలయును. అప్పుడు గమ్యస్థానమును సురక్షితముగ చేరవచ్చును. చేరితీరవలయునను నిబంధనము లేదు. ఏమో! మాయ అంతబలమైనది. కనుకనే సారథి స్థానములో తన బుద్ధిని అవతలకునెట్టి అక్కడ పరమాత్మను స్థాపన చేసినయెడల ఆ రథికుఁడు సవ్యముగా, సక్రమముగా తప్పక గమ్యస్థానము చేరఁగలఁడు. ఎందులకన మానవజీవితరథమును నడుపువాఁడు "సర్వశక్తుఁడు, సర్వజ్ఞుఁడు, అనంతుఁడు, నిత్యుఁడు"అయినపరమాత్మయే.కనుకఅర్జునుఁడిట్లొనర్చినాఁడు. ఆతని జీవితములో హెచ్చరిక తప్పియుండుటలేదు. ఒకవేళ ఎప్పుడైన ఒకక్షణము వచ్చినను కృష్ణపరమాత్మ ఆ గుఱ్ఱములను తోలు కొరడాతో, ఆ కునికిపాట్లను, ఆ పొరపాట్లను అంటించిన అంతే ఆ కునికిపాట్లు, ఆ పొరపాట్లు పటాపంచలు అగుటయే కాబట్టి అర్జునుఁడు గుడాకేశుఁడు. ఈ గుడాకేశ శబ్దమున కిక్కడప్రస్తుతము ఈఅర్థమే సమంజసము. చాలు. సంజయుఁడు "అర్జునుఁడు గుడాకేశుఁడు. ఇక నీ పుత్రులకు జయమెట్లుకలుగునని ఆశించియున్నావు?"అను భావమును ప్రకటించుచున్నాఁడు. అస్తు.

పరమాత్మ అర్జునుని రథమును ఉభయసేనామధ్యమక్షోణిలోనిలిపి "అర్జునా! ఈ కౌరవులనుచూడు!" అన్నాఁడు. ఎందులకనవలెను? "అర్జునా! నీవుచెప్పినట్లు రథమును ఎక్కడ నిలబెట్టిన నీవు అందఱిని చూడగలవో అక్కడ నిలబెట్టితిని. బాగుగాచూడుము. నీవు చూచుపర్యంతమును ఈరథ

మును ఇక్కడనే కదలకుండా నిలుపుదును" అన్నాఁడు భీష్మ ద్రోణాది బంధువులు, పూజనీయులు, ఆదరణపాత్రులు, ప్రేమ పాత్రులు అయినవారి దగ్గఱకు తీసికొనివెళ్ళి. ఏమి అభిప్రాయము కృష్ణునిది ?

అర్జునుని తన లోక కల్యాణసాధకమైన లీలలో నిమిత్త మాత్రునిగ తీసికొనదలచినాఁడు. అంతఃకరణములో ఎంత మాత్రమును ప్రాపంచికవాసనలులేనివాఁడే దానికిపాత్రుఁడు. ఉన్నవారిలో అర్జునుఁడే పాత్రుఁడు. కాని ఇంకను కొంచెము "బంధువులు, పూజనీయులు" అనువాసన బీజప్రాయముగ నున్నది. అది అలాగేయుండిపోయినయెడల తాత్కాలికముగా పనిజరిగినను, ఈ పనికి నిమిత్తమాత్రుఁడైనవాఁడు తన నిమిత్త మాత్రత్వమునకు తగినంత పరమార్థము పొందలేఁడు. పని జరుగుచున్నది. ఫలములేకుండ పోవుచున్నది. ఈ స్థితి తన భక్తుఁడైన అర్జునునకు రారాదు. దానిని తీసివేయుటకు అది తన అంతఃకరణములో ఉన్నట్లు అర్జుననికి తెలియవలె. ఆ బీజమును మొలకరూపములోనికి తీసికొనివచ్చి, గిల్లి వేయవలెను. బీజము దొరకకపోవచ్చును. కాని ఆ బీజము మొల కెత్తుటకు తగిన అవకాశమును కల్పించిన అది మొలకగా పైకివచ్చును. అప్పుడు ఆమొలకను గిల్లి వేసిన మొలకచచ్చుట యొక్కటేకాదు- దానికి కారణమైన బీజముకూడా ఇంక ఉండదు. కనుక "నావారు, పెరవారు" అన్న భావమునకు కారణమైన బీజము అర్జునుని అంతఃకరణములో నున్నది. దానిని పైకి మొలిపించవలయును. ఆ అభిప్రాయముతో,

ముఖ్యమైనవారి ఎదుటికు తీసికొనివెళ్ళి "ఇదిగో! ఈ కౌరవు లనుచూడు మర్జునా!" అనునప్పటికే ఆ బీజము మొలకెత్తుట ప్రారంభమయినది. అప్పుడు దానికి చికిత్సచేసి తన లోక కల్యాణప్రదమైన లీలలో తగినపాత్రగా ఉపయోగించుకొన వచ్చును.

**అవతారిక :**

కృష్ణపరమాత్మ ఆజ్ఞనువిని అర్జునుఁడు ఏమిచేసినది చెప్పుచున్నాఁడు.

శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః
పితౄ నథపితామహాన్ ।
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్
పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా॥ 26

శ్లో॥ శ్వశురాన్ సుహృదశ్చైవ
సేనయో రుభయోరపి।
తాన్ సమీక్ష్య సకౌంతేయ
స్సర్వాన్ బంధూనవస్థితాన్॥ 27

శ్లో॥ కృపయా పరయావిష్టో
విషీదన్నిదమబ్రవీత్।

ప॥ ఛా॥ తత్ర, అపశ్యత్, స్థితాన్, పార్థః, పితౄన్, అథ, పితామహాన్, ఆచార్యాన్, మాతులాన్, భ్రాతౄన్, పుత్రాన్,

పౌత్రాన్, సఖీన్, తథా॥ శ్వశురాన్, సుహృదః, చ, ఏవ, సేనయోః, ఉభయోః, అపి, తాన్, సమీక్ష్య, సః, కౌంతేయః, సర్వాన్, బంధూన్, అవస్థితాన్, కృపయా, పరయా, ఆవిష్టః, విషీదన్, ఇదం, అబ్రవీత్।.

టీక :—

అధ — అనంతరము, (ఇట్లు కృష్ణపరమాత్మ చెప్పిన తర్వాత)

పార్థః — అర్జునుడు,

తత్ర — అక్కడ, (ఆ యుద్ధరంగములో)

ఉభయోః సేనయోః — రెండుసేనల యందును,

స్థితాన్ — ఉన్నటువంటి,

పితౄన్ — తండ్రులను, (భూరిశ్రవుడు మొదలగు తండ్రి వరుస వారలను)

పితామహాన్ — తాతలను, (భీష్ముడు మొదలగు వారలను)

ఆచార్యాన్ — గురువులను, (ద్రోణుడు మొదలగు వారలను)

మాతులాన్ — మేనమామలను,

భ్రాతౄన్ — సోదరులను,

పుత్రాన్ — పుత్రులను,

పౌత్రాన్ — మనుమలను,

తథా — అట్లే (ఇంకను అనుఅర్థములో ప్రయోగించబడినది.

సఖీన్ — స్నేహితులను

శ్వశురాన్ = మామలను,
సుహృదశ్చైవ = సుహృత్తులను,
అపశ్యత్ = చూచెను.
సః = ఆ,
కౌంతేయః = అర్జునుఁడు,
అవస్థితాన్ = (యుద్ధరంగమున) నిలిచియున్న,
సర్వాన్ = సమస్తములైన,
తాన్ బంధూన్ = ఆబంధువులను,
సమీక్ష్య = బాగుగాజూచి,
పరయాకృపయా = అధికమైన కృపతో,
ఆవిష్టః = కూడుకొన్నవాఁడై,
విషీదన్ = దుఃఖించుచు,
ఇదం = దీనిని (ఈ వాక్యమును)
అబ్రవీత్ = పలికెను.

తా॥ అప్పుడు పార్థుఁడు ఉభయ సేనలలోనున్నట్టి తండ్రులను, తాతలను, ఆచార్యులను, మేనమామలను, సోదరులను, కుమారులను, మనుమలను, మిత్రులను, మామలను, సుహృదులనుకూడ చూచెను. అక్కడ కూడిన ఆ బంధువులనందఱను జూచి. అర్జునుఁడు అత్యంతమైన కృపతో కూడుకొన్నవాఁడై దుఃఖించుచు ఇట్లు పలికెను.

అమృతవాహిని :-

కృష్ణపరమాత్మ అట్లు రథమును తీసికొనివెళ్ళి రెండు సేనలమధ్యను నిలిపి, చూడుమని అర్జునునకు చూపించుసరికి అర్జునునికి కనుపడినవారందఱు ఎవరు ? ఎక్కడజూచినను

తండ్రివరుసవారు, భీష్ముఁడు మొదలగు తాతలును, ద్రోణుఁడు కృపాచార్యుఁడు మొదలగు ఆచార్యులును, పురుజిత్తు, కుంతి భోజుఁడు, శల్యుఁడు మొదలగు మేనమామలును, దుర్యోధ నుఁడు మొదలగు సోదరబృందమును, లక్ష్మణకుమారుఁడు, అభిమన్యుఁడు, ద్రౌపదేయులు మొదలగు కుమార సముదా యమును మనుమలవరుసవారును, అశ్వత్థామ మొదలగు మిత్రులును, ద్రుపదుఁడు, శైబ్యుఁడు మొదలగు మామలును, తనకు ఏమియు సంబంధములేకపోయినను, తనతోటి ఎట్టి లాభమును లేకపోయినను కేవలము తనహితమునే అపేక్షించి, సహాయము చేయుటకై వచ్చిన సుహృదులును కనుపడినారు. వీరినందఱిని చూచునప్పటికి అర్జునుని హృదయము కృపతో ద్రవించిపోయినది. ఇంతమంది బంధువులను చంపవలసివచ్చినదే అనువిచారము ఒక్కసారి అతని బుద్ధిని ఆవరించినది. రెండు సేనలలో అటుజూచినను, ఇటుజూచినను అందఱును తనవారే. 'వీరందఱును ఈయుద్ధములో చావవలసినవారేనా? అటు పదు నొకండక్షౌహిణులసేన, ఇటు ఏడుఅక్షౌహిణులసేన– మొత్తము పదునెనిమిదిఅక్షౌహిణులు. అబ్బ! రక్తము ప్రవహించవలసి నదే!' అనుభావము బుద్ధిని ఆవరించినకొలదిని, విచారము ఎక్కువగుచుండెను. ఆ విచారముతో (దుఃఖముతో) తన క్షత్రియోచితమైన వీరస్వభావమునుకూడ మరచిపోయినాఁడు. ఆ మోహముతో, ఏవేవో తనకు తోచినవెల్లను ధర్మములను గొని ముందుశ్లోకమునుండి అనగా 28వ శ్లోకముయొక్క ఉత్తర

భాగమునుండి నలుబదిఆఱవశ్లోకమువఱకు పదునెనిమిదిన్నర శ్లోకముల విషయము ఆవేశపూరితుఁడై ఉపన్యసించును.

అ వ తా రి క :-

తనవారి యందున్న మమకార, మోహములచేత, అర్జునున కెట్టిస్థితి కలిగినదో అర్జునుని ఈ రెండున్నర శ్లోకములలో మనకు గోచరమగును.

అ ర్జు న ఉ వా చ :—

శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణ
యుయుత్సుం సముపస్థితం॥ 28

శ్లో॥ సీదంతి మమగాత్రాణి
ముఖంచ పరిశుష్యతి
వేపథుశ్చశరీరే మే
రోమహర్షశ్చజాయతే. 29

శ్లో॥ గాండీవం స్రంసతేహస్తాత్
త్వక్చైవ పరిదహ్యతే
నచశక్నోమ్యవస్థాతుం
భ్రమతీవచమేమనః. 30

ప॥ భా॥ దృష్ట్వా, ఇమం, స్వజనం, కృష్ణ, యుయుత్సుం, సముపస్థితం, సీదంతి, మమ, గాత్రాణి, ముఖం, చ, పరిశుష్యతి, వేపథుః, చ, శరీరే, మే, రోమహర్షః, చ, జాయతే. 28,29

గాండీవం, స్రంసతే, హస్తాత్, త్వక్, చ, ఏవ, పరిదహ్యతే, న, చ, శక్నోమి, అవస్థాతుం, భ్రమతి, ఇవ, చ, మే, మనః. 30

టీక :—

హేకృష్ణ=ఓకృష్ణా!
యుయుత్సుం=యుద్ధముచేయ తలంపుగలట్టియును,
సముపస్థితం=ఎదుటనిలబడియున్నట్టియును,
ఇమంస్వజనం=ఈ బంధుజనమును,
దృష్ట్వా=చూచి,
మమ=నాయొక్క,
గాత్రాణి=అవయవములు,
సీదంతి=శిథిలములై పోవుచున్నవి.
ముఖంచ=నోరును,
పరిశుష్యతి=ఎండిపోవుచున్నది.
మే=నాయొక్క,
శరీరే=దేహమునందు,
వేపథుశ్చ=కంపమును (వడకును),
రోమహర్షశ్చ=గగుర్పాటును,
జాయతే=పుట్టుచున్నది.
హస్తాత్=చేతినుండి,
గాండీవం=గాండీవము (అర్జునుని ధనుస్సుపేరు),
స్రంసతే=జారుచున్నది.
త్వక్చైవ=చర్మముకూడ,
పరిదహ్యతే=బాగుగ దహింపబడుచున్నది.

మే = నాయొక్క,
మనః = మనస్సు,
భ్రమతీవ = తిరుగుచున్నట్లున్నది.
అవస్థాతుంచ = (రథమున) నిలుచుటకును,
నశక్నోమి = శక్తిలేకయున్నాను.

తా॥ అర్జునుఁడు.- చెప్పుచున్నాఁడు కృష్ణా! యుద్ధముచేయుటకువచ్చిన ఈ స్వజనసముదాయమునుజూచిన, నా అవయవములన్నియును శిథిలములై పట్టుతప్పి పోవుచున్నవి. నోరు ఎండిపోవుచున్నది. శరీరమంతయును వణకుచున్నది. రోమాంచము కలుగుచున్నది. చేతినుండి గాండీవము జారిపడిపోవుచున్నది. చర్మమంతయు మండుచున్నది. నామనస్సు గిఱ్ఱునతిరుగుచున్నదా అన్నట్లున్నది. నేనింక నిలువలేకుండనున్నాను.

అ మృ త వా హి ని :-

అర్జునుని గాండీవము దివ్యము. అది తాళ ప్రమాణము కలది. ఈ గాండీవమును గుఱించి విరాటపర్వములో ఉన్నది. అర్జునుఁడు బృహన్నల వేషములోఉన్నప్పుడు ఉత్తర కుమారు నితో వర్ణించిచెప్పెను. "ఇది అర్జునునియొక్క జగత్ప్రసిద్ధ మైన ధనుస్సు. ఇది బంగారుకట్లు కలిగినది. ఇది శస్త్రము లన్నిటిలో ఉత్తమమైనది. ఇతర ఆయుధములు లక్షఅయినను దీనితో సరిపోవేమో" అంతశక్తికలది. ఈ ధనుస్సువల్లనే దేవతలలోను, మానవులలోను అర్జునుఁడు విజయము సాధించి నది. ఈ అద్భుతమైన, విశాలమైన, విచిత్రమైన ధనువును దేవ తలు, దానవులు, గంధర్వులు చాలకాలము ఆరాధించినారు. ఈ పరమ ధనుస్సును బ్రహ్మ ఒక్క వెయ్యిసంవత్సరములు, ప్రజాపతి అయిదువందల మూడు సంవత్సరములు, ఇంద్రుడు

పంచాసీ సంవత్సరములు, చంద్రుఁడు అయిదునందల సంవత్స రములు, వరుణదేవుఁడు ఒక వందసంవత్సరములు ఉంచుకొని, ఆ వరుణదేవుఁడు అగ్నిదేవునకు ఇచ్చెను. అగ్నిదేవుఁడు అర్జునుఁడుచేసిన అద్భుతకర్మకు మెచ్చుకొని ఈ గాండీవమును అర్జునునకు ఇచ్చెను. ఇది గాండీవము చరిత్ర.

అర్జునునికి కలిగిన ఈస్థితికి కారణమేమనిన, ఈయుద్ధము వలన కలిగెడి పరిణామమును ఆలోచించినకొలదిని అర్జునునికి మహాభయంకరముగా కనుపడుచున్నది. అందఱును స్వజనము. ఇందులో వృద్ధులు, బాలురు, సర్వులు కలరు. పదునారు పదు నెనిమిది సంవత్సరముల బాలుర దగ్గఱనుండి, భీష్మపితా మహునివంటి వృద్ధులవఱకును ఉన్నారు. వీరినందఱను జూచిన అర్జునునకు, వీరందఱును ఒక్కపెట్టున మహాభయంకర కరాళ ముల తెరచి యుంచుకొన్న మృత్యువు ముఖమున ప్రవేశించ బోవుచున్నట్లు తోఁచినది. ఇక తరువాత మిగులునదెవరు? స్త్రీలు. ఎంత వర్ణసంకరము కాగలదు? ఈ విషయమును ఆలోచించినకొలదిని అర్జునుని హృదయము ఏదో చెప్పరాని బాధతో దుఃఖపడుచున్నది. "ఆ విషమపరిణామము తలంచు కొన్న భయము వేయుచున్నది. ఈ కారణమున నా శరీరమున కిట్టి దురవస్థ సంప్రాప్తమైనది కృష్ణా!" అనుచున్నాఁడు అర్జు నుఁడు. ఏమి ఆ దురవస్థ? దురవస్థకాదా! అవయవము లన్నియు పట్టుతప్పి పోవుచున్నవే. ఇంతవఱకును బాగుగనే యున్నవే! జబ్బులేదే! అకస్మాత్తుగ ఇదేమి? నోరు ఎండిపోవు చున్నది. నాలుక లాగుకొని పోవుచున్నది. పెదిమలు తడుపు

కొందమనిన నాలుకమీద తడిఉండినగదా! ఏమో తెలియదు. ఎందులకో తెలియదు. శరీరము కంపించిపోవు చున్నది. రోమములు నిక్కపొడుచుకొనుచున్నవి. ఎంత తమాయించు కొందమన్నను చేతగాకయున్నది. చేతినుండి గాండీవము జారిపడిపోవుటయా? ఎప్పుడైనకలదా? ఈ గాండీవమును మోయుశక్తి నాచేతికిలేదా? ఇంతలో ఎందువల్ల ఇట్లుమారవలెను? చేతితో పట్టుకొనలేకుండనున్నాను. వ్రేళ్లు బిగించిన బిగియుటలేదు. దేహముమీద చర్మమంతయును ఎవరో దహించుచున్నారేమో అనిపించుచున్నది. లేనిచో ఈ మంటలేమి? భరించలేను. మనస్సు చక్రమువలె తిరిగిపోవు చున్నది. మనస్సు స్వాధీనముతప్పి అట్లు తిరుగుచుఉన్నచో శరీరము ఎట్లు నిలుచును? నిలువలేకుండఉన్నాను. రథముమీద నిలబడి ఎట్లు యుద్ధముచేయుట? చేతులు పట్టులేవాయె. శరీరము అంతకుముందే మెత్తపడి కూలబడుచున్నది. మూర్ఛ రాదుగదా? రథముమీదనుండి క్రిందపడిపోనుగదా?

"కృష్ణ!" అనగా

(1) శ్లో॥ కృషిర్భూవాచకశ్శబ్దో
ణశ్చనిర్వృత్తి వాచకః
తయోరైక్యం పరంబ్రహ్మ
కృష్ణఇత్యభిధీయతే.

తా॥ కృషి, భూవాచకము, అనగా సత్తావాచకము. "ణ" నిర్వృత్తివాచకము. అనగా ప్రత్యక్షానందవాచకము. ఈ సత్తాయొక్కయును, ఆనందముయొక్కయును ఏకత్వమే పరబ్రహ్మమైన కృష్ణుడు.

(2) 'కర్షయతి సర్వాన్ స్వకుక్షౌ ప్రలయకాలే ఇతి కృష్ణః'

అనగా ప్రళయకాలములో సర్వజీవులను తనకుక్షియందు లీనము చేసికొనువాఁడుగనుక కృష్ణుఁడు.

(3) 'దోషాన్ కృషతి నివారయతి ఇతికృష్ణః' అనగా జీవులయొక్క పాపాదిదోషములను పోగొట్టువాఁడుగనుక కృష్ణుఁడు.

(4) 'పురుషార్థాన్ ఆకర్షయతి ప్రాపయతి ఇతికృష్ణః' అనగా భక్తులకు దుర్లభమైన పురుషార్థములను పొందింప జేయువాఁడు కనుక కృష్ణుఁడు.

(5) 'భక్తాన్ ఆకర్షయతి ఇతికృష్ణః' అనగా భక్తులను తనవైపునకు ఆకర్షించువాఁడు కనుక కృష్ణుఁడు.

(6) 'భక్తానాం పాపాన్ కృషతి నివారయతి ఇతికృష్ణః' అనగా భక్తుల పాపములను పోగొట్టువాఁడు కనుక కృష్ణుఁడు.

(7) 'శ్యామవర్ణత్వాత్ కృష్ణః' శ్యామవర్ణము కలవాఁడగుటచేత కృష్ణుఁడు.

అవతారిక:-

తరువాత అర్జునుఁడు తనకు అపశకునములుకూడ కలుగుచున్నట్లు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ నిమిత్తానిచ పశ్యామి
విపరీతాని కేశవ!
నచశ్రేయోఽనుపశ్యామి
హత్వా స్వజనమాహవే. 31

ప॥ ఛా॥ నిమిత్తాని, చ, పశ్యామి, విపరీతాని, కేశవ, న, చ. శ్రేయః, అనుపశ్యామి, హత్వా, స్వజనం, ఆహవే.

టీక :-

హే కేశవ=ఓకృష్ణా !
విపరీతాని=అనర్థసూచకములగు,
నిమిత్తాని=శకునములను,
పశ్యామి=చూచుచున్నాను.
ఆహవే=యుద్ధమునందు,
స్వజనం=బంధుజనమును,
హత్వా=చంపి, (చంపుటచేత అని భావము)
శ్రేయశ్చ=మేలును,
నానుపశ్యామి=చూడకున్నాను. (మేలుఎంత మాత్రమును కనుపడుటలేదు అని భావము)

తా॥ ఓ కేశవా ! అమంగళకరములైన అపశకునములుకూడ చూచుచున్నాను యుద్ధమునందు ఈ స్వజనులందఱిని చంపుటచేత కలుగబోవు మంచి కూడ నాకేమియును కనుపడుటలేదు.

అ మృ త వా హి ని :-

('ఏదియైనను ఒకపనిచేయబోవునప్పుడు ఆపనియొక్క కలుగబోవు పరిణామమునను సూచించు శకునములను నిమిత్తములందురు. ఆ నిమిత్తములు శుభసూచకములుగాను, అశుభసూచకములుగాను ఉండవచ్చును. అశుభసూచకములైన నిమిత్తములను విపరీత నిమిత్తములు లేక అపశకునములు అందురు.) ఇప్పుడు నాకు అపశకునములు కనుపడుచున్నవి.

కాన మనముచేయబోవు యుద్ధమువలన అమంగళముతప్ప, కలుగుమంచి ఏమియును ఉన్నట్లు తోచుటలేదు. 'అపశకునములు అనగా భూమి అదురుట, సూర్యుడు కనుపడకపోవుట, పురుషులకు ఎడమకన్ను, ఎడమభుజము అదురుట, మంగళకరమైన వస్తువులు చేతిలోనుండి జారిపడిపోవుట మొదలగునవి అన్నియును. ఇవి కనుపడుచున్నవి) కృష్ణా! కనుక మనము ఇప్పుడు యుద్ధము చేయకుండుటయే శ్రేయస్కరము. బంధుజనులను చంపుటచేత హృదయములో తీరనిచింత ఒకటి; ఆత్మీయులు, ప్రియులు ఐనవారు లేకపోవుట చేత, ఎన్నియున్నను మిగిలిన జీవితమంతయును దుఃఖమయము గానే యుండుట రెండు; బంధువులైనవారిని చంపుటచేత గొప్పపాపము కలుగుట మూడు. ఇదియంతయునుజూచిన, ఈ లోకములోగాని, పరలోకములోగాని మనకు సుఖము, హితముకూడ లేదు. కాబట్టి నా అభిప్రాయమున యుద్ధము మానుటయే మంచిది.'

శుభశకునములు, అశుభశకునములు కలవు. వీటినే అనుకూల నిమిత్తములు, విపరీత నిమిత్తములు అనియు అందురు. ఈ శకునములు కలుగుటకు కారణము మన భ్రమప్రమాదములు కాకూడదు. ఆకాశమున సూర్యుడు కనుపడడు. మనము అన్నివిధములను స్వస్థచిత్తులమై యున్నప్పుడు, నేత్రదోషములు లేనప్పుడు ఇట్టివి కలిగినయెడల దానిని శకునము అందురు. కండ్లకు పైత్యముచేత బైర్లుక్రమ్మి కనుపడకపోయిన అది శకునముకాదు. ప్రయాణము గు

నప్పుడు పాము కనుపడరాదు. అయితే భ్రమచేత పాము లేనిది పామువలె కనుపడిన అది భ్రమకాని శకునముకాదు. మంగళకరమైన ఒక పదార్థము చేతినుండి జారిపడినచో అది అశుభశకునము. కాని జబ్బుచేత పట్టులేకనో, తాత్కాలిక మనోవికల్పముచేత అవయవములలో పట్టుదప్పియో జారి పోవుట జరిగిన, ఇదంతయు 'అశుభశకునము' అనుకొన్న అది హృదయదౌర్బల్యము. ఇది తెలిసికొనక పోవుటచేత మానవులు అక్కరలేని భయములకు లోనౌచున్నారు.

ఉదాహరణము.–రైలుస్టేషన్‌లో 'రెక్క'వాలిన రైలు వచ్చునను సూచన. ఇదిఒక నిమిత్తము. కాని నిజముగా రెక్కవాలిన రైలువచ్చునా? ప్రయాణికుని కన్నుచెదిరి రెక్క వాలినట్లు కనుపడిన రైలువచ్చునా? నిజముగా రెక్క వాల వలె; రైలు రావలె. ఇంతియకాని, కన్నుచెదిరి రెక్క వాలి నట్లు కనుపడిన రైలురాదు. ఇట్లే ఈ శకునములును. ఇప్పుడు అర్జునునకు కలిగిన శకునములు ఇట్టివి. 'నోరు ఎండుచున్నది' అనగా ఏల ఎండదు ? దడపుట్టినచో, భయము కలిగినచో, భరించలేని విచారమువచ్చి మీదపడినచో నోరెండును. అట్లే శరీరములో పటుత్వము తప్పిపోయిన చేతిలోని గాండీవము జారిపోవును. ఇది అపశకునము ఎట్లుఅగును? ఇట్లే అన్నియు ఊహించుకొనవలయును. ప్రతిదానికిని భయపడరాదు.

శ్లో॥ నకాంక్షే విజయంకృష్ణ
నచరాజ్యం సుఖానిచ

కింనోరాజ్యేన గోవింద
కింభోగైర్జీవితేనవా॥ 32

ప॥ ఛా॥ న, కాంక్షే, విజయం, కృష్ణ, న, చ, రాజ్యం, సుఖాని, చ, కిం, నః, రాజ్యేన, గోవింద, కిం, భోగైః, జీవితేన, వా.

టీక :—

హేకృష్ణ—ఓకృష్ణా !
విజయం—విజయమును,
నకాంక్షే—కోరను.
రాజ్యంచ—రాజ్యమును,
సుఖానిచ—సుఖములనుకూడ,
న (కాంక్షే)—కోరను.
హేగోవింద—ఓగోవిందా !
నః—మనకు,
రాజ్యేన—రాజ్యముచేత,
కిం—ఏమి? (ప్రయోజనము ఏమి?)
భోగైః—భోగములచేతగాని,
జీవితేనవా—బ్రతికియుండుటచేతగాని,
కిం—ఏమి? (ప్రయోజనము ఏమి?)

తా॥ కృష్ణా! నాకు విజయమక్కరలేదు. రాజ్యము, సుఖములుకూడకోరను. హేగోవిందా! మనకు ఈ రాజ్యములచేగాని, భోగములచేగాని, ఈ జీవితముతో గాని ఏమి ప్రయోజనము ?

**అమృతవాహిని :—**

'కృష్ణా! ఇంతమంది బంధుజనమును మారణహోమము చేసిన తరువాత ఈ కలిగెడి విజయము ఎవరికి కావలయును ?

ఈ రాజ్యము, ఈ సుఖములు ఎవరికి ? నాకు అక్కరలేదు ! 'అందఱునుపోయిన తరువాత ఎవరుచూచి సంతోషించు నది ? మనము ఏపనిచేసినను ఈలోకమున ఆనందము, సుఖమును, పరలోకమున ఆనందము, సుఖమును కోరియే కదా! ఇప్పుడు ఈ యుద్ధము చేయుటచేత కలుగునదేమి ? అందఱు మృత్యుదేవత పాలగుటయే. తరువాత మనకు వచ్చిన రాజ్యమును, ఇండ్లు వాకిండ్లు, అన్నియును చూచిన కొలఁదిని, మనతో ఎవరుండి ఇవన్నియును అనుభవించవలసిన వారో, వారు లేకపోవుటచే, దుఃఖమునకే కారణము లగుచుండును. చివరకు నాఒక్కనికొఱకా ఇంతమంది ప్రాణములు తీయునది? కనుక ఈ లోకములోను, పరలోకములోనుకూడ ఆనందమును, హితమును లేని ఈ యుద్ధముఎందులకు చేయవల యును? ఎవరికొఱకు చేయవలయును? ఇంతమందిని దేనికొఱకు చంపవలయును? ఇంతమంది చచ్చిన తరువాత మనకు రాజ్యము చేతగాని, ఈ భోగములచేతగాని, ఈ జీవితముచేతగాని ఏమి ప్రయోజనము గోవిందా!' అనుచున్నాఁడు.

'గోవింద' అనగా–గో = వేదాంతములచేత, వింద = తెలియఁబడువాఁడు. గో = వేదములను, వింద = తెలిసిన వాఁడు. వేదవేత్త కనుక 'గోవిందా' అని సంబోధనచేసి అర్జు నుఁడు ఈ భావమును వ్యక్తము చేయుచున్నాఁడు. 'గోవిందా! నీవుకూడ ఇట్టి ఘోరపాపకర్మకు పాలుచేయుచున్నావేమి?' అని.

శ్లో॥ యేషామర్థే కాంక్షితన్నో
రాజ్యం భోగా స్సుఖానిచ
తఇమేఽవస్థితాయుద్ధే
ప్రాణాం స్త్యక్త్వాధనానిచ॥ 33

ప. ఛా యేషాం, అర్థే, కాంక్షితం, నః. రాజ్యం, భోగాః, సుఖాని, చ, తే, ఇమే, అవస్థితాః, యుద్ధే, ప్రాణాన్, త్యక్త్వా, ధనాని, చ.

టీక .—

నః = మనకు,
రాజ్యం = రాజ్యము,
యేషాం = ఎవరియొక్క,
అర్థే = ప్రయోజనముకొఱకు,
కాంక్షితం = కోరఁబడినదో,
భోగాః = భోగములును,
సుఖానిచ = సుఖములునుకూడ,
(యేషామర్థేకాంక్షితాని = ఎవరినిమిత్తము కోరఁబడినవో)
తేఇమే = అటువంటివీరు,
ప్రాణాన్ = ప్రాణములను, (ప్రాణములమీఁది ఆశను)
ధనానిచ = ధనములను, (ధనములమీఁది ఆశను)
త్యక్త్వా = విడిచిపుచ్చి,
యుద్ధే = యుద్ధమునందు,
అవస్థితాః = నిలిచియున్నారు.

తా॥ మనము ఎవరికొఱకై రాజ్యమును, భోగములను, సుఖములను కోరుచున్నామో వారందఱును ఇదిగో: ధనములమీదను, ప్రాణములమీదను ఆశను త్యజించి, యుద్ధమునందు నిలఁబడియున్నారు.

అ మృ త వా హి ని :-

కృష్ణా! నాకు ఈ రాజ్యము, భోగములు, సుఖములు ఎంతమాత్రమును ఆవశ్యకములుకావు. వీటిలో దేనియందును నిలుకడకల ఆనందములేదు. ఇవి నిత్యములుకూడ కావు. 'అయితే ఎవరికొఱకు' అందువా? ఇదిగో! ఈ బంధువులు, కుమారులు, సోదరులు మొదలైన స్వజనముకొఱకై ఈ రాజ్యము మొదలగువానిని కోరుచుంటిని. కాని ఇప్పుడు వీరందఱు ఈ యుద్ధములో చనిపోవుటకు సిద్ధముగానున్నారు. వీరందఱును చనిపోయిన తరువాత, వీరికొఱకై నేనుకోరు ఈ రాజ్యాదులతో నాకేమి ప్రయోజనము? కాబట్టి ఎన్నివిధముల జూచినను యుద్ధముచేయుట మంచిదికాదు.

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రా
స్తథైవచ పితామహాః।
మాతులాశ్శ్వశురాః పౌత్రా
శ్శ్యాలా స్సంబంధిన స్తథా॥ 34

ప॥ ఛే॥ ఆచార్యాః, పితరః, పుత్రాః, తథా, ఏవ, చ, పితామహాః, మాతులాః, శ్వశురాః, పౌత్రాః, శ్యాలాః, సంబంధినః, తథా.

టీక –

ఆచార్యాః = గురువులును,
పితరః = తండ్రులును,
పుత్రాః = కుమారులును,

తథైవ — అట్లే,
పితామహాః — తాతలును,
మాతులాః — మేనమామలును,
శ్వశురాః — మామలును,
పౌత్రాః — మనుమలును,
శ్యాలాః — (భార్యతోఁ బుట్టిన వారైన) బావ మఱఁదులును,
తథా — అట్లే,
సంబంధినః — చుట్టములును (అయిఉన్నారు.)

తా॥ గురువులు, తండ్రులు, పుత్రులు, పితామహులు, మేనమామలు, మామగార్లు, మనుమలు, బావమఱఁదులు, వియ్యంకులు– ఇంకను అనేకమంది స్వజనులు వీరేగదా ఉన్నది!

అ మృ త వా హి ని :–

అర్జునుఁడు ఇంతమందిని చెప్పుట ఎందులకనగా, ప్రపంచములో ఎవరైనను ఇట్టి తనవారికొఱకేగదా రాజ్యములు, ధనములు, సుఖములు, భోగములు కోరునది! వీరందఱును చనిపోయినతరువాత సుఖదాయకములు అనుకొను రాజ్యములు, భోగములు దుఃఖమునకే కారణములగునుగదా! "ఇట్టి పరిస్థితిలో ఈ రాజ్యములు, భోగములు ఎందులకు? కనుక యుద్ధముచేయను" అని భావము.

శ్లో॥ ఏతాన్నహంతుమిచ్ఛామి
ఘ్నతోఽపి మధుసూదన

అపి త్రైలోక్య రాజ్యస్య
హేతోః కిన్ను మహీకృతే. 35

ప. ఛా. ఏతాన్, న, హంతుం, ఇచ్ఛామి, ఘ్నతః, అపి, మధుసూదన, అపి, త్రైలోక్యరాజ్యస్య, హేతోః, కిం, ను, మహీకృతే.

టీక .—

హేమధుసూదన—ఓ కృష్ణా!
ఘ్నతోఽపి—(వీరు మనలను) హింసించువారలైనను,
త్రైలోక్యరాజ్యస్య—(వీరిని చంపుట) మూఁడు లోకముల రాజ్యమునకును,
హేతోరపి—నిమిత్తమైనను,
ఏతాన్—వీరిని,
హంతుం—చంపుటకు,
నఇచ్ఛామి—ఇష్టపడకున్నాను.
మహీకృతే—భూలోక రాజ్యముకొఱకు,
కిను—చెప్పవలసినదేమి!,

తా॥ హే మధుసూదనా! దుర్యోధనాదులు మనలను చంపుటకు సిద్ధముగా నున్నను వీరిని చంపుటచే త్రైలోక్యాధిపత్యము లభించినను వీరలఁ జంపను. ఇక అల్పమైన ఈ భూమండలాధిపత్యము చెప్పవలయునా!

అమృతవాహిని :-

మధుసూదనా! ఈదుర్యోధనాదులు యుద్ధము చేయకుండ తిరిగి పోయెడు నన్ను చంపిన చంపుదురుగాక! నేను మాత్రము వీరలను చంపను. 'ఘ్నతోఽపి' అనుటచేత మనము యుద్ధము చేయకున్నచో, మనలను వీరు చంపవలసిన

పనిలేదు. చంపరు. ఒకవేళ దుర్మార్గులై చంపుదురుగాక, అయినను నేనుమాత్రము వారలను చంపను. త్రైలోక్య రాజ్యము వచ్చినను చంపనుసుమా! ఇంక ఈరోజుఉండి రేపు పోవు అశాశ్వతమైన, తుచ్ఛమైన ఈఅల్పభూమండల రాజ్యము కొఱకా వీరిని చంపుచది! ఎప్పుడును చంపను.

త్రైలోక్యాధిపత్యము వచ్చినను ఎందులకు వీరిని చంపనో తెలియునా?

శ్లో॥ నిహత్యధార్తరాష్ట్రాన్నః
కా ప్రీతిస్స్యాజ్జనార్దన!
పాపమేవాశ్రయేదస్మాన్
హత్వైతానాతతాయినః. 36

ప. ఛా. నిహత్య, ధార్తరాష్ట్రాన్, నః, కా, ప్రీతిః, స్యాత్, జనార్దన, పాపం, ఏవ, ఆశ్రయేత్, అస్మాన్, హత్వా, ఏతాన్, ఆతతాయినః.

టీక .—

హేజనార్దన=ఓ కృష్ణా!
ధార్తరాష్ట్రాన్ =దుర్యోధనాదులను,
నిహత్య=చంపి (చంపుటచేత)
నః=మనకు
కాప్రీతిః=ఏమిసంతోషము,
స్యాత్ =అగును!
ఆతతాయినః (అపి)=ఆతతాయులుఅయినను,

ఏతాన్ = వీరిని
హత్వా = చంపి, (చంపుటచేత)
అస్మాన్ = మనలను,
పాపమేవ = పాపమే,
ఆశ్రయేత్ = ఆశ్రయించును.

తా॥ ఓ జనార్దనా! దుర్యోధనాదులను చంపుటచేత మనకు కలిగెడి సుఖమేమున్నది? ఈ ఆతతాయులను జంపిన మనకు లభించునది పాపమే

## అ మృ త వా హి ని :-

జనార్దన శబ్దార్థము .-

(1) 'జనాన్ అర్దయతి హినస్తి నరకా(దీ)న్ గమయతివాజనార్దనః' జనులను దండించువాఁడు; లేక పాపులను నరకములలోఁ ద్రోయువాఁడు కనుక జనార్దనుఁడు.

(2) 'జనైః పురుషార్థం అభ్యుదయ నిశ్శ్రేయస లక్షణం యాచ్యత ఇతి జనార్దనః' జనులు పరమ కళ్యాణరూపమైన పురుషార్థమును ఎవనిని యాచించుచున్నారో వాఁడు జనార్దనుఁడు.

(3) 'జనయత ఇతి జనో దృశ్య వర్గస్తం అంతర్బహిశ్చ సర్వదోఽర్దతి వ్యాప్నోతి ఇతి జనార్దనః' జగత్తులోని సర్వమును లోపల బయట వ్యాపించియుండుటచేత జనార్దనుఁడు.

(4) 'జనాన్ అర్దతే గతి కర్మణోనురూపం ఇతిజనార్దనః' మానవులకు వారివారి కర్మానురూపమైన గతి ప్రసాదించువాఁడు కనుక జనార్దనుఁడు.

(5) 'సర్వజనైరర్ద్యతే యాచ్యతే స్వాభిలషితసిద్ధయే ఇతి జనార్దనః' సర్వులచేతను తమతమ కోర్కెలు సిద్ధించుటకై యాచింపఁబడువాఁడు కనుక జనార్దనుఁడు.

(6) 'జనం జననం తత్కారణ మజ్ఞానంచ స్వసాక్షాత్కారేణ అర్దయతి హినస్తీతి జనార్దనః' పుట్టుకను, దానికి కారణమైన అజ్ఞానమునుకూడ తన సాక్షాత్కారముచేత, నశింపఁజేయువాఁడు కనుక జనార్దనుఁడు.

(7) 'జన మాయా అర్దన పీడనకారీ ఇతి జనార్దనః' మాయనుబాధించువాఁడు కనుక జనార్దనుఁడు. అనగా భక్తులకు మాయను తొలఁగించి మోక్షప్రదానము చేయువాఁడు అని భావము.

'ఆతతాయి'అనగా —

శ్లో॥ "అగ్నిదో గరదశ్చైవ
శస్త్రపాణిర్ధనాపహః
క్షేత్రదారాపహారీ చ
షడేతే ఆతతాయినః॥"

ఇంటికి నిప్పుపెట్టువాఁడు, విషముపెట్టువాఁడు, చంపుటకై శస్త్రములు ధరించి సిద్ధముగా వచ్చినవాఁడు, ధనమును సర్వమును దోచుకొనువాఁడు, భూమిని అపహరించువాఁడు, భార్యను హరించువాఁడు— ఈ ఆరుగురును ఆతతాయులు అనఁబడుదురు. అనగా ఇందులో ఏఒక్కటిచేసినను ఆతతాయి అనఁబడును. ఇంక ఈ ఆరును చేసినవారిని చెప్పవలయునా?

దుర్యోధనాదులు పాండవుల విషయములో ఈ ఆరును చేసినారు.

(1) లక్కయింటిలోపెట్టి నిప్పుపెట్టినారు. పరమాత్మ కరుణ వీరియందుండుటచే బ్రతికినారుకాని, లేకపోయిన ఏమై పోవలసినది ? (2) భీమన్నకు విషము పెట్టినారు. (3) ఇప్పుడే కాదు అనేకమారులు పాండవులమీదికి యుద్ధమునకు బయలు దేరుట జరిగినది. (4) కపటజూదములో ధనమంతయును కట్టు గుడ్డలతోసహా హరించినారు. (5) రాజ్యమంతయును అన్యాయముగా కపటజూదములోనే హరించినారు. (6) ద్రౌపదిని నిండుసభలో చీరలొలుచుటకు ప్రయత్నించి అవమానముచేసినారు. ఇంతకంటె ఇఁక చేయవలసినఘోరములు ఏమున్నవి! కాబట్టియే ధార్తరాష్ట్రులను ఆతతాయులుఅనుట.

'జనార్దనా! దుర్యోధనాదులు ఆతతాయులు. అయినను వారినిచంపిన మనకు పాపమేవచ్చును. అంతకంటె మనకు వచ్చునది ఏమియును లేదు.' అనుచున్నాఁడు.

అర్జునుఁడు మోహావిష్టుఁడై సత్యమునుమఱచి మాట్లాడుచున్నాఁడు. కాని యథార్థమాలోచించిన

శ్లో॥ ఆతతాయిన మాయాతిం
హన్యాదేవావిచారయన్
నాతతాయి వధేదోషః
హంతుర్భవతి కశ్చన॥

అని మనువు అనినాఁడు. అనగా "ఆతతాయి అనిష్టము చేయుటకు వచ్చినయెడల, అతనిని వెనుకముందులు ఆలో

చించక చంపివేయవలయును. ఆతతాయిని వధించుటచేత చంపినవానికి ఏమాత్రమును దోషమంటదు.”అని ఉండుటచేత పరమాతతాయులైన దుర్యోధనాదుల నెట్లువధించినను దోషములేదని భావము. అయితే అర్జునుడుకూడ శాస్త్రములు చదువుకొన్నవాడే. కనుక, “సఏవపాపిష్ఠతమో యః కుర్యాత్ కులనాశనః” – “ఎవడైతే కులనాశనముచేయునో వాడేపాపిష్ఠితముడు.వానికంటె ఇంకపాపిలేడు”అనిభావము. కాబట్టి కులనాశనము చేయరాదని భావము. కాని ఈ సందర్భము వేరు. అవసరమువచ్చినప్పుడు వివరణ చేయబడును.

శ్లో॥ తస్మాన్నార్హావయంహంతుం
ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్
స్వజనంహి కథం హత్వా
సుఖినస్స్యామ మాధవ. 37

ప. ఛా. తస్మాత్, న, అర్హాః, వయం, హంతుం, ధార్తరాష్ట్రాన్, సబాంధవాన్, స్వజనం, హి, కథం, హత్వా, సుఖినః, స్యామ, మాధవ.

టీక :—

హేమాధవ=ఓకృష్ణా !
తస్మాత్=అందువలన,
వయం=మనము,
సబాంధవాన్=బంధువులతోకూడుకొనిన,
ధార్తరాష్ట్రాన్=దుర్యోధనాదులను,
హంతుం=చంపుటకు,

నా గ్హాః=అర్హులముకాము.
స్వజనం=స్వజనమును, (బంధువులను)
హత్వా=చంపి,
కథం=ఎట్లు,
సుఖినః=సుఖముగలవారము,
స్యామహి=అగుదుము ?

తా॥ కావున్ హేమాధవా! బంధువులతోకూడిన ధార్తరాష్ట్రులను చంపుట మనకు తగదు. స్వజనులనుచంపి ఏమిసుఖము అనుభవించగలము!

## అ మృ త వా హి ని :-

మాధవా! సబాంధవముగా ధార్తరాష్ట్రులను సంహరించుట మనకు తగనిపని. వారు మనకెన్ని ద్రోహములు, మోసములు చేసినను, ఎన్నెన్ని బాధలుపెట్టినను వారందఱు మన స్వజనమేకదా! వారందఱినిచంపి ఏమిసుఖము పొందగలము? ఐహికసుఖమా? పరలోకసుఖమా? రెండును శూన్యములే.ఇంక మహాపాపముకూడ చుట్టుకొనగలదు."సఏవ పాపిష్టతమో యః కుర్యాత్ కులనాశనః" అనగా వినలేదా? కులమును నాశనముచేసినవానికంటె పాపిఎవరు? ఎటుజూచినను మనము ఈ యుద్ధముచేయుట మంచిదికాదు.

## అ వ తా రి క :

'కుటుంబనాశనమువలనగలుగు పాపము ఉభయపక్షములకును సమానమే. ఈ పాపమును గుఱించి విచారించి దుర్యోధనుఁడు యుద్ధమునుండి విరమించిపోవుటలేదే! నీకెందులకీ

విచారము?' అని కృష్ణపరమాత్మ అనునేమోనని ఊహించుకొని, సమాధానముగా రెండుశ్లోకములలో చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యద్యప్యేతే న పశ్యంతి
లోభోపహత చేతసః
కులక్షయకృతం దోషం
మిత్రద్రోహేచ పాతకం. 38

శ్లో॥ కథం నజ్ఞేయ మస్మాభిః
పాపాదస్మాన్నివర్తితుం
కులక్షయ కృతం దోషం
ప్రపశ్య ద్భిర్జనార్దన. 39

ప. ఛా. యది, అపి, ఏతే, న, పశ్యంతి, లోభోపహతచేతసః, కులక్షయకృతం, దోషం, మిత్రద్రోహే, చ, పాతకం. ॥38॥

ప. ఛా. కథం, న, జ్ఞేయం, అస్మాభిః, పాపాత్, అస్మాత్, నివర్తితుం, కులక్షయకృతం, దోషం, ప్రపశ్యద్భిః, జనార్దన ॥39॥

టీక :—

లోభోపహతచేతసః = పేరాసచేత చెడిపోయిన చిత్తముఁగల,

ఏతే = ఈ, (దుర్యోధనాదులు)

కులక్షయకృతం = కులక్షయమువల కలుగు,

దోషం = దోషమును,

మిత్రద్రోహే = మిత్రద్రోహమునందలి,

పాతకంచ = పాపమునుకూడ,

నపశ్యంతి—చూచుట లేదు. (తెలియకున్నారు)
యద్యపి—అయినను,
హేజనార్దన—ఓకృష్ణా !
కులక్షయకృతం—కులక్షయమువలనకలుగు,
దోషం—దోషమును,
ప్రపశ్యద్భిః—బాగుగ చూచుచున్న, (తెలిసికొన్న)
అస్మాభిః—మనచేత,
అస్మాత్—ఈ,
పాపాత్—పాపమునుండి,
నివర్తితుం—బయటపడుటకు,
కథం—ఎట్లు ?
నజ్ఞేయం—తెలియదగినదికాదు ?

తా॥ వీరు రాజ్యలోభముచేత బుద్ధిచెడి, కులక్షయమువలన కలుగు దోషమును, మిత్రద్రోహముచేత వచ్చెడి పాపమును గ్రహించలేకుండనున్నారు. కులక్షయమువలన కలిగెడి దోషమును కాంచుచున్న మన మాపాపమునుండి తొలగుటకు ఎందుకు విచారించరాదు ?

అ మృ త వా హి ని :-

ఆ! నిజమే. దుర్యోధనునికికూడ ఈ యుద్ధముచేయుట ఎంతమాత్రము తగనిపనియే. కాని, అతను ఇంత క్రూరమైన, ఈ కులక్షయమునకు కారణమైన ఈ యుద్ధము చేయుట, మిత్రద్రోహము చేయుట ఆశ్చర్యపడతగినది కాదు. ఆబాల్యము అతనిస్వభావమే అది. అతనికికావలసినది రాజ్యము. ఆ రాజ్యకాంక్ష అతనిబుద్ధిని పూర్తిగ చెడగొట్టినది. కనుక 'ఇది చేయ

తగినది, ఇది చేయతగనిది' అని నిర్ణయము చేసికొనుట అతనికి చేతగాదు. అతని వివేకము నశించినది. కులక్షయ కారణమైన ఈ యుద్ధమువలన ఎంతపాపము సంభవింపనున్నదో, ఈ ఉభయసేనలలోను కల బంధువులలో, మిత్రులలో వైరము కల్పించి, ఒకరినొకరు చంపుకొనునట్లు చేయుటచే కలుగు మహాపాతకము ఎంతయో, దుర్యోధనాదులు విచారించుటలేదు. కాని, ఇన్నియు తెలిసిన మనముకూడ వీరివలెనే అంధులము ఎందుకు కావలయును? కులనాశనముచేత కలుగు దోషము బాగుగా తెలియును మనకు. తెలిసి తెలిసి, ఇట్టి మహాపాపములో ఎందుకు దిగవలయును? మనము చక్కగ విచారించి, ఈ పాపమునుండి బయటపడుదము. ఈ రాజ్యమును వీరికే యిచ్చి, మనము సుఖముగా నుందము.

అవతారిక :-

కులక్షయముచేత ఏయే దోషములు కలుగునో చెప్పుచున్నాఁడు.

శ్లో॥ కులక్షయే ప్రణశ్యంతి
కులధర్మాస్సనాతనాః।
ధర్మేనష్టే కులంకృత్స్న
మధర్మోఽభి భవత్యుత॥ 40

ప॥ ఛా॥ కులక్షయే, ప్రణశ్యంతి, కులధర్మాః, సనాతనాః, ధర్మే, నష్టే, కులం, కృత్స్నం, అధర్మః, అభిభవతి, ఉత.

టీ క :-

కులక్షయే (సతి)=కులక్షయముకాగా,
సనాతనాః=సనాతనములైన,
కులధర్మాః=కులధర్మములు,
ప్రణశ్యంతి=పూర్తిగా నశించుచున్నవి.
ధర్మేనష్టే (సతి)=ధర్మము నశించగా,
అధర్మః=అధర్మము,
కులంకృత్స్నం=కులమునంతటను,
అభిభవత్యుత=వ్యాపించుచున్నదిగదా !

తా॥ కులము నశింపుటచేత సనాతనములైన కులధర్మములు నశించుచున్నవి. ధర్మము నాశనమగుటచేత కులమంతయును అధర్మముచేత వ్యాపించబడిపోవును.

అ మృ త వా హి ని :-

కృష్ణా! కులమునశించుటచేత ఎంత ప్రమాదమో చూచితివా? తనకులములో పూర్వమునుండియును పరంపరగా శాస్త్రసమ్మతము శిష్టసమ్మతమునైన ఏ మర్యాద జాగ్రత్తగా వచ్చుచున్నదో, ఏ మర్యాద జాగ్రత్తగ సురక్షితముగ నుండుటచేత సదాచారము బాగుగా కాపాడఁబడి అనుష్ఠానములో నుంచఁబడుచున్నదో "ఆ మర్యాద పెట్టనికోటవలె నున్నంతకాలముస్త్రీలలోనుపురుషులలోనుఅధర్మముప్రవేశింప వీలులేకుండనుండునో అట్టి శుభప్రదమైన శ్రేష్ఠమైన సనాతన ధర్మరూపమైన కులమర్యాదలు నశించిపోవుచున్నవి. ఇప్పుడు ఈ యుద్ధములో అనేకమంది పెద్దలు, పిన్నలుకూడ మరణించు

టచేత మిగిలిన స్త్రీలకు, బాలురకు ఇది మర్యాద, ఇది అమర్యాద, ఇది ధర్మము, ఇది అధర్మము అనువిషయములు బోధించువారే లేకపోవుటచే చివరకు ఆ స్త్రీపురుషులయందు అమర్యాద, అధర్మము వ్యాపించిపోవును. ఇట్టిస్థితిలో అధర్మము వ్యాపించుట సహజమేగదా! ఎంతశోచనీయమైన దశకలుగనున్నది! ఎప్పుడు ధర్మము నశించినదో కులములన్నియును కట్టుబాట్లులేక మర్యాదనతిక్రమించి చెడిపోవును. దానితో కులమంతయును పాపమే వ్యాపించగలదు. కారణమేమనగా మానవుడు ధర్మమును జాగ్రత్తగా రక్షించుకొనగలుగుటకు అయిదు ముఖ్యకారణములు.

(1) 'పరమాత్మ ఉన్నాడు. తప్పుచేసిన శిక్షించును' అనుభయము. (2) శాస్త్రవిశ్వాసముండుటచేత, 'అన్ని శాస్త్రములందును ఇట్లు చెప్పబడియున్నది' అని జాగ్రత్తగ నడుచుకొనగలుగుట. (3) ప్రభుత్వము శిక్షించుననుభయము. (4) కులమర్యాదలు చెడిపోవుననుభయము. (5) శారీరకముగాను, ఆర్థికముగాను అనేక నష్టములు, కష్టములుకలుగు నన్నభయము. ఈ ఐదుకారణములును ఎట్లుచెడిపోవునో చూడుము–

(1) పరమాత్మ ఉన్నాడను విషయమును, (2) శాస్త్రములు యథార్థముగా సత్యమే అయినను, అవి మానవుని శ్రద్ధమీదనే ఆధారపడియున్నవి. ఏ హేతువాదము చేతగాని, ప్రత్యక్షముగాగాని ఋజువు చేయదగినవికావు. (3) ప్రభుత్వ

భయము- ప్రభుత్వము కేవలము ప్రజలకొఱకే ఏర్పడినది. కాని ఎవరిచేతిలో ప్రభుత్వమున్న వారికి ఈవిశ్వాసముండవలె కదా ! సామాన్యముగ అది ఉండదు. ఎందువల్లననగా చెప్పు వారు ఉండరుగదా! ఆ కారణమున చిన్నతనములో తెలియదు. తెలియకపోయిన మానె తనకు తెలిసినదే సర్వము అనుకొందురుగదా! వారే పెద్దవారైన తరువాత ఇఁక ఎవరు చెప్పినను వినరుగదా ! కాబట్టి ప్రభుత్వములోకూడ భగవంతుఁడన్నను, శాస్త్రములన్నను, కులమర్యాదలన్నను విశ్వాసము లేకుండ పోయిన ఇఁక వీటికొఱకు ప్రభుత్వము శిక్షించునా! శిక్షించదు. ఇంక ఈ భయమెందుల కుండును? (4) కుల మర్యాద వ్యక్తిగతముగాగాక కుటుంబము, వంశముమీద ఆధారపడియుండును. చెప్పువారు లేకపోవుటచే ఎవరికివారే స్వతంత్రులయిపోదురు. ఒకరు చెప్పువారు మిగిలినవారు విని నడుచుకొనువారుగా నున్నప్పుడుతప్ప కులమర్యాదలు ఎట్లు రక్షింపఁబడును? సమాజము మొత్తముయొక్క ఏకాభిప్రాయము మీద ఆధారపడి ఆ కులధర్మము ఉండును. ఎవరికివారే స్వతంత్రులై, ఎవరిఇష్టము వారికి ధర్మమైనప్పుడు, ప్రతివారు స్వేచ్ఛాచారులైనప్పుడు ఆ కులధర్మములు నిలువవు. కళ్లెము లేని, పొగరెక్కిన గుఱ్ఱమువలె స్వేచ్ఛాచారులు ఏ నియమమును సహించుకొనలేక అనేక అనర్థములకు కారణులయ్యెదరు. ఈస్థితి మానవుని నిరంకుశునిగా, స్వేచ్ఛాచారునిగా, రూపొందిన స్వార్థముగా తయారుచేయును. కులములోగాని, సమాజములోగాని ఏనాడిట్టి ఉచ్ఛృంఖలత, నిరంకుశత్వము

స్వేచ్ఛాచారత వ్యాపించునో, ఇంక పాపమునకును, అధర్మమునకును కొఱత ఏమున్నది ? అంతయును పాపమయమే కాగలదు. ఇంక (5) శారీరక ఆర్థికపరిస్థితులు, ఇంత స్వేచ్ఛాచారత, నిరంకుశత్వము ప్రబలినప్పుడు ప్రత్యేకము వ్యక్తిమీద ఆధారపడియుండును. కాన అది ఎన్నిపతనములందునో ఎవరికె ఎఱుక? ఇట్లు చివఱకు కులములు,సమాజములు అధర్మముతో, పాపముతో నిండిపోవును కృష్ణా! ఇన్ని అనర్థములకు కారణమైన ఈయుద్ధము మనము చేయకపోవుటయే శ్రేయస్కరము.

అవతారిక:-

ఇప్పుడు కులములు, సమాజములు ఇంతపాపము, అధర్మముతో వ్యాపించిపోయిన కలుగు నష్టము చెప్పుచున్నాడు.

శ్లో॥ అధర్మాభిభవాత్కృష్ణ !
ప్రదుష్యంతి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసువార్ష్ణేయ !
జాయతే వర్ణసంకరః॥ 41

ప. ఛ. అధర్మాభిభవాత్, కృష్ణ, ప్రదుష్యంతి, కులస్త్రియః, స్త్రీషు, దుష్టాసు, వార్ష్ణేయ, జాయతే, వర్ణసంకరః.

టీక:-

హేకృష్ణ—ఓకృష్ణా !
అధర్మాభిభవాత్—అధర్మముచేత బాగుగా కొట్టఁబడుటవలన,

కులస్త్రియః=కులస్త్రీలు,
ప్రదుష్యంతి=పూర్తిగా చెడుచున్నారు.
హేవార్ష్ణేయ=ఓకృష్ణా!
స్త్రీషు దుష్టాసు (సతీసు)=స్త్రీలు చెడినవారుకాగా,
వర్ణసంకరః=వర్ణసంకరము,
జాయతే=కలుగుచున్నది.

తా॥ ఇట్లు అధర్మము వ్యాపించుటచేత కులస్త్రీలు చెడిపోవుదురు. స్త్రీలు చెడిపోయినయెడల వర్ణసంకరమేర్పడును.

అ మృ త వా హి ని :-

ఎప్పుడు మానవసమాజములో, కులములో ఉచ్ఛృంఖలత, స్వేచ్ఛాచారత, స్వార్థము, భోగలాలసత్వము ప్రబలినవో, స్త్రీపురుషులు స్వతంత్రులైరో అప్పుడువారిచేత చేయఁబడు ప్రతిక్రియయును స్వార్థము, భోగలాలసత్వమును పరమ ప్రయోజనములుగా నెంచుకొని చేయఁబడును. కనుక అధర్మముగానే యుండును. వారిచేత చేయఁబడు ప్రతిచిన్నపనియును, స్వార్థము, భోగలాలసత్వముయొక్క ప్రేరణచేతనే జరుగును. ఇంక అధర్మమునకు ఇంతకంటెమించినదేమి కావలయును? ఈ కారణమున పాపము త్రివిక్రమావతారమువలె పెరిగిపోయి కులములు, సమాజములు నిండిపోవును. ప్రతిచోటను పాపమే వ్యాపించుటచేత ఇఁక స్త్రీలలోను,పురుషులలోనుఒకమర్యాద, కట్టుబాటు, ధర్మము అనిన ఎంతమాత్రమును విలువలేకుండ పోవును. వాటిని ఆచరించకపోయినమానె, అసలు తెలిసి

కొందమను అభిప్రాయమే ఉండదు. ఎవరైననొకరు అట్లు ఉండి చెప్పఁబోయినయెడల వారిని ఇష్టమువచ్చినట్లు మాట్లాడుట, పిచ్చివారినిగా భావించుట జరుగును. లేక అట్టివారిని ద్వేషించుటయైనను జరుగును. ఇట్టిపరిస్థితిలో ఇంకకులధర్మముయొక్క, సమాజధర్మముయొక్క, మానవధర్మముయొక్క రక్షణకు ఆధారభూతమైన పవిత్రసతీధర్మము నశించిపోగలదు. పవిత్రమైన ధర్మసంస్థాపనకు మూలాధారమైన సతీధర్మము, పాతివ్రత్యము ఎప్పుడునశించినదో అప్పుడే స్త్రీపురుషులలో వ్యభిచారదోషము ప్రబలిపోవును. దానితో కులస్త్రీలందఱును చెడి, వర్ణసంకరమేర్పడును. ఒకజాతిలోనిస్త్రీకి ఇంకొకజాతిలోని పురుషునకు సంయోగమేర్పడిననాడు ఆ సంతానము సంకరమైనది. ఇట్లు తల్లితండ్రులు వేఱువేఱు జాతివారైనప్పుడు వర్ణసంకరమేర్పడును. ఈవిధముగా కులముయొక్క పరంపరానుగతమైన ధర్మములన్నియును నశించిపోవును. వర్ణసంకరమేర్పడును.

**అ వ తా రి క :-**

ఇట్లు వర్ణసంకర సంతానమేర్పడుటచేత కలిగెడి హానిని గూర్చి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ సంకరో నరకాయైవ
కులఘ్నానాంకులస్య చ।
పతంతిపితరోహ్యేషాం
లుప్తపిండోదకక్రియాః॥ 42

ప. భా సంకరః, నరకాయ, ఏవ, కులఘ్నానాం, కులస్య, చ,
పతంతి, పితరః, హి, ఏషాం, లుప్తపిండోదకక్రియాః.

టీక.—

సంకరః=వర్ణసంకరము,
కులఘ్నానాం=కులమును నాశనము చేసినవారికిని,
కులస్యచ=కులమునకును,
నరకాయైవ=నరకముకొఱకే,
(భవతి=అగుచున్నది)
హి=కారణమేమన,
ఏషాం=వీరియొక్క,
పితరః=పితృదేవతలు,
లుప్తపిండోదకక్రియాః (సంతః)=పిండోదకక్రియలు లేనివారలౌచు,
పతంతి=అధోగతిని పడుచున్నారు.

తా॥ ఈ వర్ణసంకరము కులమును నశింపజేసినవారికిని, కులమునకును కూడ నరకహేతు వగుచున్నది. పిండములు వేయువారును, ఉదకము వదలు వారును లేక పితరులు నరకమున కూలుచున్నారు.

అ మృ త వా హి ని:-

పై శ్లోకములో 'అధర్మము వ్యాపించి కులస్త్రీలు చెడిపోదురు. స్త్రీలు చెడుటచేత వర్ణసంకర మేర్పడును.' అని చెప్పఁబడినది. వర్ణసంకరము కులనాశకులను, కులమునుకూడ నరకమున త్రోయుననియుఁ జెప్పఁబడినది. పై శ్లోకములో చెప్పఁబడిన అనేక కారణములచేత వర్ణసంకరము కులమునం దంతటను అధర్మము, పాపము వృద్ధిపొంది వ్యాపించునట్లు

చేయును. అధర్మముచేత, పాపముచేత వ్యాపించఁబడిన కులము నరకమునబడక ఏమౌను ? ఇఁక వర్ణసంకరమునకు కారణమైన కులఘాతుకుల విషయము వేఱుగ చెప్పవల యునా ?

పితృదేవతలుకూడ నరకమున కూలుదురు. వారేమి చేసిరి? వీరు చేసినదానికి పితృదేవతలకు ఈ పతనమెందులకు ? పితృదేవతలకు పిండము వదలువారుగాని, ఇన్నినీళ్లు వదలు వారుగాని లేక వారు అధోగతిని పడుచున్నారు. 'పిండము వదలుట' అనగా శ్రాద్ధమున పిండప్రదానముచేయుట. పితరుల నుద్దేశించి, శాస్త్రముప్రకారము బ్రాహ్మణ భోజనము చేయించుటను 'పిండక్రియ', అనగా ఆంధ్రములో 'పిండము వద లుట' అందురు. 'ఉదకక్రియ'అనగా'నీళ్ళువదలుట'అనగా తర్పణ ములు వదలుట అని అర్థము. ఈ రెండును కలిసి మూలమున "పిండోదకక్రియాః" అని ప్రయోగించఁబడినది. ఇవి రెండును చేయువారు లేక, ఏ పితరులకు ఇవి రెండును లోపించినవో, వారు "లుప్తపిండోదక క్రియులు"; అటువంటి పితరులు అధో గతికి కూలుదురు. శాస్త్రములందు విశ్వాసము కలవారు పిత రుల నుద్దేశించి పిండోదక క్రియలు చేయుచుందురు. వీటినే 'శ్రాద్ధములు' అని, తెలుగు దేశమున 'తద్దినములు' అని యును, వైష్ణవ సంప్రదాయములో 'తిరువధ్యయనములు' అని యును అందురు. ఉదకక్రియను 'తర్పణములు వదలుట' అందురు. ఒక్కొక్క విశేషములలో 'ధర్మోదకములు' 'తిలో దకములు' అని వదలుచుందురు. ఇవి అధికారులు సకాలమున,

సక్రమమైన పద్ధతులలో చేసినయెడల పితృదేవతలకు వాని ఫలము ముట్టునని శాస్త్రమూలకమైన విశ్వాసము. కులమంతయును అధర్మము, పాపము వ్యాపించిననాఁడు, కులస్త్రీలు చెడి వర్ణసంకర మేర్పడిననాఁడు శాస్త్రములందు విశ్వాసము నశించుటచేత, ఆ విధానమే తెలియదు. ఎవరైనను చెప్పినను శ్రద్ధ, విశ్వాసము ఉండదు. కాబట్టి చేయరు. పోనీ ఎవరైన చేసినను శాస్త్రరీత్యా చేయుటకు వారికి అధికారము లేక పోవుటచే, అది పితృదేవతలకు ముట్టదు. ఈ విధముగా పితృదేవతలకు తమ సంతానముద్వారా పిండోదకములు ముట్టనినాఁడు, లేక ఇచ్చువారు లేనినాఁడు ఆ పితరులకు నరకమే గతి. అధోగతికి కూలుదురు.

శ్లో॥ దోషైరేతైః కులఘ్నానాం
వర్ణసంకరకారకైః
ఉత్పాద్యంతే జాతిధర్మాః
కులధర్మాశ్చ శాశ్వతాః. 43

ప. ఛా. దోషైః, ఏతైః, కులఘ్నానాం, వర్ణసంకరకారకైః, ఉత్సాద్యంతే, జాతిధర్మాః, కులధర్మాః, చ, శాశ్వతాః.

టీక :—

కులఘ్నానాం=కులమునునాశనముచేసినవారియొక్క,
వర్ణసంకరకారకైః=వర్ణసంకరమునకు
కారణములైన,
ఏతైః దోషైః=ఈ దోషములచేత,
శాశ్వతాః=సనాతనములైన,

జాతిధర్మాః=వర్ణధర్మములు,
కులధర్మాశ్చ=కులధర్మములున్నూ,
ఉత్సాద్యంతే=నష్టమైపోవుచున్నవి.

తా॥ కులనాశకులయొక్క వర్ణసంకరకారణములగు దోషములవలన, సనాతన జాతిధర్మములను, కులధర్మములను నష్టమైపోవుచున్నవి.

## అమృతవాహిని :-

వర్ణసంకరమునకు కారణములగు దోషములుఅనగా (1) కులమునశించుట, (2) కులమునశించుటచే కులధర్మము నశించిపోవుట, (3) కులమంతయును పాపము వృద్ధిపొందుట, (4) పాపము వృద్ధియగునప్పటికి ఆ కారణమున స్త్రీలు చెడిపోవుట. ఈ నాలుగును వర్ణసంకరమునకు కారణమైన దోషములు. ఈ నాలుగు దోషములచేతను వర్ణసంకరము కలుగుచున్నది. వర్ణసంకరమునకు కారణములైన ఈ దోషముల వలన శాశ్వతములైన జాతిధర్మములును, కులధర్మములును నశించుచున్నవి. కులధర్మములనగా వంశపరంపరానుగతమైన సదాచారములు, మర్యాదలు 'సనాతన కులధర్మము'లనబడును. వేదశాస్త్రములచేత ప్రసాదించఁబడిన వర్ణాశ్రమధర్మములు 'జాతిధర్మము'లనబడును.

కులధర్మములను అనగా వంశపరంపరానుగతమైన ధర్మములను చెప్పెడిపెద్దలు, వృద్ధులు లేకపోవుటచే కులధర్మములన్నియును నశించిపోవును. ఈ కారణమున వర్ణసంకరమునకు కారణమైనదోషము వ్యాపించుచున్నది. జాతిధర్మములుకూడ

నశించుచున్నవి. కులధర్మములు నశించి, స్త్రీలుచెడి వర్ణసంకర మేర్పడుటచే వర్ణసంకర సంతానమునకు వర్ణాశ్రమ ధర్మములందు అధికారములేదు. కాన అధికారములేనివారు ఆచరించినను అదిధర్మమనబడదు. కనుక ఆచరించువారు లేకపోవుటచే వర్ణాశ్రమ ధర్మములుకూడ నశించుచున్నవి. ఈవిధమున జాతి ధర్మము నశించుటకుకూడ వర్ణసంకరమే కారణమగుచున్నది.

శ్లో॥ ఉత్సన్నకులధర్మాణాం
మనుష్యాణాం జనార్దన
నరకే నియతం వాసో
భవతీ త్యనుశుశ్రుమ. 44

ప. ఛా. ఉత్సన్నకులధర్మాణాం, మనుష్యాణాం, జనార్దన, నరకే, నియతం, వాసః, భవతి, ఇతి, అనుశుశ్రుమ.

టీక :--

హే జనార్దన—ఓ కృష్ణా!
ఉత్సన్నకులధర్మాణాం-
ఉత్సన్న—చెడిన, లేక నశించిన,
కులధర్మాణాం—కులధర్మములుగల,
మనుష్యాణాం—మానవులకు,
నరకే—నరకమునందు,
నియతం—సదా,
వాసః—ఉనికి,
భవతి—అగుచున్నది,

ఇతి = అని,

అనుశుశ్రుమ = వినియున్నాము.

తా॥ కులధర్మములు నశించిన మానవులకు అవధిలేని కాలము అనగా దీర్ఘకాలము నరకమున ఉండుట కలుగునని మనము వినుచున్నాము.

## అమృతవాహిని :-

హే జనార్దనా! ఏమానవులకు కులధర్మములు నశించినవో ఆ మానవులు ఎల్లప్పుడును అధర్మములోనే ఉందురు. ఆ పాప ఫలము ననుభవించుటకు వారు 'కుంభీపాకము, రౌరవము మొదలగు నరకములలో అనేకరకములైన మహాభయంకర యాతనల ననుభవించ వలయును.' ఇట్లని పరంపరగా పెద్దలైన వారివలన వినుచున్నాము. శ్రుతులలోకూడ వినబడుచున్నది. మానవుడు మరణించగనే 'ఆతివాహికము' అను దేహము అతనికి లభించుచున్నది. మానవుడు ఈ స్థూలదేహమును వదలి, సూక్ష్మదేహముతోడ ఆ శరీరములో ప్రవేశించును. ఇది పదిరోజులు కర్మయగువఱకును ఉండి, ప్రేతపిండ ప్రదానము కాగానే, దీనికిబదులు 'భోగదేహము' లభించుచున్నది. ఆ దేహమున ఈ సూక్ష్మదేహముతోడనే ప్రవేశించును. సంవత్సరాంతమున 'సపిండీకరణము' అను శ్రాద్ధము పెట్టుట తోడనే, ఈ భోగదేహముపోయి, మరియొక దేహము లభించును. సూక్ష్మదేహముతో ఆ దేహమున ప్రవేశించి, తన కర్మానుసారము నరకమునకో, స్వర్గమునకోపోయి, అక్కడ ఆయాబాధలనో, భోగములనో అనుభవించును. నరకమునకు

పోవువాఁడు యాతనాదేహమున ప్రవేశించును. స్వర్గాది ఊర్ధ్వలోకములకు పోవువాఁడు దివ్యశరీరమున ప్రవేశించును.

**అవతారిక :-**

అర్జునుఁడు ఇంతవఱకును స్వజనులను వధించుటచేత కలిగెడి అనర్థములను, పాపములను చెప్పి, ఇప్పుడు యుద్ధమును గూర్చి తన దుఃఖమును వెలిబుచ్చుచున్నాఁడు.

శ్లో॥ అహో బత మహత్పాపం
కర్తుం వ్యవసితా వయమ్
యద్రాజ్య సుఖలోభేన
హంతుం స్వజనముద్యతాః॥ 45

ప ఛా. అహో, బత, మహత్పాపం, కర్తుం, వ్యవసితాః, వయం, యత్, రాజ్యసుఖలోభేన, హంతుం, స్వజనం. ఉద్యతాః,

**టీక :-**

యత్ = ఏ,
రాజ్యసుఖలోభేన = రాజ్యసుఖమునందలి పేరాసచేత,
వయం = మనము,
స్వజనం = బంధుజనమును,
హంతుం = చంపుటకు,
ఉద్యతాః = సిద్ధమైనవారమో,
అహో = ఆశ్చర్యము!
బత = అయ్యో,
మహత్పాపం = మహాపాపమును,

కర్తుం = చేయుటకు,
వ్యవసితాః = పూనుకొన్నవారము?

తా॥ అహో! అయ్యో! ఎంతపాపముచేయుటకు మనము సిద్ధపడుచున్నాము! రాజ్యసుఖములందలి లోభముచేత స్వజనమైన ధార్తరాష్ట్రులను సంహరించుటకుకూడ సిద్ధమగుచున్నామే!

## అమృతవాహిని :-

కృష్ణా! ఆశ ఎంతటి ఘోరకార్యములనైనను చేయించును గదా! రాజ్యసుఖములందలి లోభముచేత నేగదా! ప్రాణముకంటెనుకూడ ప్రియమైన ఈ స్వజనులను దయాదాక్షిణ్యములులేక చంపుటకు సిద్ధముగానున్నాము. అహో! ఏమి ఆశ్చర్యము! అయ్యో! తలంచుకొన్నచో ఎంతదుఃఖము! పెద్దలవలన శ్రవణముచేసి, శాస్త్రములను అధ్యయనము చేయుటచేత తెలిసికొనిన మనముకూడ సమయమువచ్చునప్పటికి ఎంతఘోరపాతకమునకు కాలుద్రువ్వుచుంటిమి? ఆశ్చర్యము! దీనిచేత కుంభీపాకరౌరవాది నరకములకు పోయి, ఎన్నెన్ని మహాభయంకరయాతనల ననుభవించవలయును? అయ్యో! తలచుకొన్న ఎంతభయము, దుఃఖము కలుగుచున్నది. మనము చివరికిట్లు ఎంతనీచులమై ఎంత నీచపు పనికి తలపడితిమి?

## అవతారిక :-

ఇట్లు తనుచేయబోవుపనికి పశ్చాత్తాపమును వెలిబుచ్చి ఇఁక తన నిర్ణయమును చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యదిమా మ ప్రతీకార
మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణేహన్యు
స్తన్మేక్షేమతరం భవేత్. 46

ప. ఛా యది, మాం, అప్రతీకారం, అశస్త్రం, శస్త్రపాణయః, ధార్త రాష్ట్రాః, రణే, హన్యుః తత్, మే, క్షేమతరం, భవేత్.

టీక —

శస్త్రపాణయః = చేతులయందు ఆయుధములుగల,
ధార్తరాష్ట్రాః = దుర్యోధనాదులు,
అశస్త్రం = ఆయుధములు లేనట్టియును,
అప్రతీకారం = ప్రతిక్రియ చేయనట్టియును,
మాం = నన్ను,
రణే = యుద్ధమునందు,
హన్యుర్యది = చంపువారలైరేని,
తత్ = అది,
మే = నాకు,
క్షేమతరం = మిక్కిలి క్షేమము,
భవేత్ = అగును.

తా॥ ఆయుధములు ధరించనటువంటిన్నీ, ఎదుర్కొననట్టిన్నీ, నన్ను ఆయుధములు ధరించిన ధార్తరాష్ట్రులు యుద్ధమునందు సంహరించినచో అది నాకు మిక్కిలి క్షేమమేయగును.

అ మృ త వా హి ని :-

కృష్ణా! ఇన్ని కారణములు, అనర్థములు ఉండుటచేత మనము యుద్ధము చేయవద్దు. 'వారు దుష్టులు, నీవు యుద్ధము

చేయకున్నను నిన్ను వధించక మానరు' అందువా ! అట్లైనను నాకు మేలేయగును. కాని వారినిమాత్రము వధించుట ఎంత మాత్రమును మంచిదికాదు. 'అంతఱును యుద్ధమునకు తయారయినారు. యుద్ధప్రారంభమునకు సూచనగా సింహనాదములు, రణవాద్యములు మ్రోగినవి. ఉభయపక్షములవారు ఆయుధములు ధరించి సిద్ధముగానున్నారు. ఇంక ఇప్పుడు నేను యుద్ధము చేయకపోయినను నన్ను వధించియే తీరెదరు' అను భయము నాకులేదు. నేను శస్త్రములు ధరించకయును, యుద్ధము చేయకయును ఉన్నయెడల, ధార్తరాష్ట్రులుకూడ, యుద్ధము చేయకపోవచ్చును. అట్లుజరిగినయెడల ఆత్మీయులైన బంధువులు రక్షింపఁబడుదురు. కాక వారు యుద్ధమునకే సిద్ధపడినను నేను యుద్ధముచేయను. యుద్ధముచేయని నన్ను వారు చంపుదురా ? అదినాకు అధికమైన మేలేయగును. కారణమేమన, కులఘాతకరూపమైన మహాభయంకరపాపము నుండి బయటపడినవాడనగుదును. ఇంకొకటి – వారు నన్నొకనినే సంహరించెదరు. మిగిలిన ప్రియబాంధవ్రులందఱును రక్షింపఁబడుదురు. ఈ యుద్ధములో చనిపోవుటకు సిద్ధముగానున్న ఇంత బంధులోకమును మృత్యుముఖమునుండి రక్షించిన మహాపుణ్యముచేత, మహాఫలమైన పరమగతి నాకు అతిసులభముగా దొరకగలదు. కాన వారు నన్ను చంపిన నాకు అపారమైన క్షేమమేయగును.

**అవతారిక :-**

'కృష్ణపరమాత్మతో ఇన్నిమాటలును చెప్పి, చివఱకు

ఏమిచేసినాఁడు' అని ధృతరాష్ట్రునకు కలుగు జిజ్ఞాసకు సమాధానముగా సంజయుఁడు అర్జునునిస్థితిని వర్ణించి చెప్పుచున్నాఁడు.

సంజయ ఉవాచ —

శ్లో॥ ఏవముక్త్వార్జున స్సంఖ్యే
రథోపస్థ ఉపావిశత్।
విసృజ్యసశరం చాపం
శోకసంవిగ్నమానసః. 47

ప. ఛా. ఏవం, ఉక్త్వా, అర్జునః, సంఖ్యే, రథోపస్థే, ఉపావిశత్, విసృజ్య, సశరం, చాపం, శోకసంవిగ్నమానసః.

టీక :—

సంఖ్యే = యుద్ధరంగమునందు,
అర్జునః = అర్జునుఁడు,
ఏవం = ఈప్రకారముగా,
ఉక్త్వా = పలికి,
శోకసంవిగ్నమానసః = దుఃఖముచేత బాగుగా చలించిన మనస్సుగలవాఁడగుచు,
సశరం = బాణములతోకూడిన,
చాపం = ధనుస్సును,
విసృజ్య = జారవిడిచి,
రథోపస్థే = రథముపైన,
ఉపావిశత్ = కూర్చుండెను.

సంజయుఁడు చెప్పుచున్నాఁడు.—

తా॥ ఇట్లు అర్జునుఁడు శోకముతో చలించిన మనస్సుకలవాఁడై శరచాపము అను జారవిడిచి, రణభూమిలో రథముపై చతికిలపడెను.

అమృతవాహిని :-

ధృతరాష్ట్రమహారాజా! అర్జునుడు కృష్ణభగవానునితో ఇట్లుచెప్పి, 'ఇక నేను యుద్ధముచేయను' అని బాణములపోడి, గాండీవము క్రిందికిజారవిడిచి, వెలవెలబోయిచుచు కన్నీరుమున్నీరుగాకార ఆ ఉభయసేనా మధ్యమక్షోణిలో పాండవులు, నీవారుకూడ చూచుచుండగా రథముమీద కూలబడినాడు. ఈ యుద్ధముచేత ఇంత బంధునాశనము జరుగుచున్నదే యను ఆవేదన, కులములు కులధర్మములు నాశనమగుచున్న వేలను దుఃఖము, వీనివలన కలుగబోవు మహాపాపము, ఆ పాపము యొక్క మహాభయంకరమైన కుంభీపాక, రౌరవాదినరకయాతనలు తలంచుకొనుటచేత కలిగిన భయము- ఇవన్నియు అర్జునుని చిత్తములో చెలరేగి, ఇష్టమువచ్చినట్లు కలతపెట్టగా, ఆ శోకమహాసముద్రములో మునిగి, నేత్రములవెంట దుఃఖాశ్రువులు ధారగా ప్రవహింప రథముమీద కూలబడినాడు.

ఓం తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జున
విషాదయోగో నామ ప్రథమోఽధ్యాయః.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం యమునగిరి
యతిరాజ సంపత్కుమార మునీంద్రాణాం శిష్యేణ
సీతారామయతినా విరచితే అమృతవాహినీ
నామ శ్రీగీతావ్యాఖ్యే ప్రథమోఽధ్యాయః.

